వృత్త ౧౧-౨౮౮

। । । న । । U స U U । త U U గగము.

అనయమును వేదాంగంబు సెప్పఁగ, దనుజహార న స్తంబు ల్గగంబుగ
దెనఁగొని ధరాభృద్విశ్రమంబుల్, దనరునది వృత్తావృత్త మంచున్.

పృథ్వి ౧౧-౮౯౬

। । । న । । । న । U । జ । U వగము.

నలినభవసుతానాజలగం, బులు గలయతులఁ బొందుపడం
దెలుపఁ బలికినఁ బృథ్వి యనఁగ, వెలయు నొకసమవృత్త మిలన్.

వృంత ౧౧-౨౫౬

। । । న । । । న । । U స U U గగము.

నగణయుగము సగణం బొందుఁగ, గగ మొకటియు జతిగాఁ గూడఁగ
ఖగవిరమములను గల్పింపఁగ, దగుఁ గవులకు వసుధ న్వృంతల్.

మౌక్తికమాల ౧౧-౪౮౭

U । । భ U U । త । । । న U U గగము.

భక్తజనత్రాత భతనగాసం, యుక్తము లై మౌనియుతయతుల్ సు
వ్యక్తము లై సూక్తులమరఁ జెప్పఁగ, మౌక్తికమాలాక్రమము లెసంగున్.

ఉపస్థితము (శిఖండివిరుతము); (స్త్రీ) ౧౧-౨౮౬

। U । జ । । U స U U । త U U గగము.

ఉపస్థితమునం దొప్పారుచుండుఁగ, దపస్వివిరతు ల్దాకం జకారం
బుపై సతగణంబు ల్గద్వయంబుఁగ, గపిధ్వజసఖా కామేపలీశా.

ఏకరూప ౧౧-౩౯౬

U U U మ U । । భ । U । జ U U గగము.

ఏపారుం గావ్యముల నేకరూపల్, ప్రాపుగ్రీశుఁగ మభజగాగణంబుల్
శ్రాపించుం గుంజరవిరామ మొప్పఁగ, బాపంబుల్ వాయుటకుఁ బ్రస్తుతింపన్.

చంద్రిక ౧౧-౭౦౪

। । । న । । । న U । U ర । U వగము.

అగవరధర నారవాన్వితం, బుగఁ గృతులను జెప్పఁ బొందికై
తగ నిధివిరమంబు దాఁకఁగా, జగతిని నెగడొందుఁ జంద్రికల్.

వ. ద్వాదశచ్ఛందం బగుజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బండ్రెండేసియక్షరంబు
లై ౪౦౯౬ వృత్తంబులు వుట్టె నందు.

స్రగ్విణి ౧౨-౧౧౭౧

∪ । ∪ ర ∪ । ∪ ర ∪ । ∪ ర ∪ । ∪ ర.

కామెపల్లీమహా ◆ గ్రామమధ్యంబునన్
భూమిదేవోత్తము ◆ ల్పూజ సేయంగ నా
స్వామియున్నాఁడనన్ ◆ స్రగ్విణిన్ శైలవి
క్రామయుక్తిం జతు ◆ ష్కంబగున్ రేఫముల్.

భుజంగప్రయాతము ౧౨-౫౮౬

। ∪ ∪ య । ∪ ∪ య । ∪ ∪ య । ∪ ∪ య.

భజింతున్ సదా కామె ◆ పల్లీనివాసున్
వ్రజస్త్రీవిటున్ యాద ◆ వశ్రేష్ఠు నంచున్
భుజంగప్రయాతాఖ్య ◆ మొల్నాల్గు యాలన్
గజవ్రాతవిశ్రాంతి ◆ గాఁ జెప్ప నొప్పున్.

తోటకము ౧౨-౧౭౫౬

।। ∪ స ।। ∪ స ।। ∪ స ।। ∪ స.

తగుఁ దోటకవృత్తము ◆ ధాతృయతిన్, సగణంబులు నాలుగు ◆ సాగినఁ బ
న్నగపుణ్యనదీసుర ◆ నాథదిశా, జగతీద్విజపట్టణ ◆ సంచరణా.

జలధరమాల ౧౨-౨౪౧

∪∪∪ మ ∪ ।। భ ।। ∪ స ∪∪∪ మ.

ధీరుల్ మెచ్చం గృతుల న ◆ తిశ్రీదం బై, మారాకారా జలధర ◆ మాలావృత్తం
బై రాజిల్లున్ భువిఁ జతు ◆ రాస్యక్రాంతుల్, సారం జేరన్ మభసమ ◆ సంయుక్తం బై.

వంశస్థము ౧౨-౧౩౮౨

। ∪ । జ ∪∪ । త । ∪ । జ ∪ । ∪ ర.

జతల్ జరేఫంబులు ◆ సామజాతస, మ్మితాక్షరక్రాంతుల ◆ మెప్పు వుట్టఁగాఁ
బతంగరాజధ్వజుఁ ◆ బద్మలోచనున్, నుతింప వంశస్థ మ ◆ నూన మై చనున్.

ఇంద్రవంశము ౧౨-౧౩౮౧

∪∪ । త ∪∪ । త । ∪ । జ ∪ । ∪ ర.

ఇందీవరాక్షుల్ తగ ◆ నింద్రవంశ మా, నందంబునం బాడిరి ◆ నందనూతిపై
డెందంబుల న్మోహము ◆ లేవ మీఱఁగాఁ, బొం దై గజక్రాంతులు ◆ పూనఁదా బ్రలన్.

ద్రుతవిలంబితము ౧౨-౧౮౬౮

I I I న U I I భ U I I భ U I U ర.

ద్రుతవిలంబిత•రూప మగుం గుభృ, ద్యుతి నభారయు•తంబుగఁ జెప్పినన్
నతజనార్తివ•నవ్యసనప్రియా, వితతభూసుర•వీరపురాలయా.

తోదకము (తామరసము) ౧౨-౭౮౦.

I I I న I U I జ I U I జ I U U య.

సలలితతోదక•సామజవిశ్రాం, తులను నజాయలఁ • దోదకవృత్తం
బలవడుఁ గేశవ•రాసురకాష్ఠా, జ్వలనవశోకర•సాస్థలవాసా.

ప్రియంవద ౧౨-౧౮౦౦

I I I న U I I భ I U I జ U I U ర.

విభు శమీరపృథు•వీజరత్నభా, గభవనాలయునిఁ గామెపల్లికా
ప్రభు నభజ్రలను • బ్రస్తుతింప నా, నిభవిరామమున • నీప్రియంవదల్.

ప్రమితాక్షరము ౧౨-౧౬౬౨

I I U స I U I జ I I U స I I U స.

ప్రమితాక్షరం • బమరుఁ బద్మజవి, శ్రమ మొప్పమీఱ • సజసాయుతమై
యమునానదీతటవి•హార పృథా, ప్రమదాకుమారసఖ • భద్రయశా.[1]

జలోద్ధతగతి ౧౨-౧౮౭౬.

I U I జ I I U స I U I జ I I U స.

జలోద్ధతగతిం ది•శాగజయతిన్, మెలంగు నిసుమాఱు • మెచ్చుగ జసల్
ఫలానుభవ కామె•పల్లినిలయా, ఖలాంబుదసమీర • కామజనకా.

విశ్వదేవి ౧౨-౯౬౬

U U U మ U U U మ I U U య I U U య.

శ్రీవత్సాంకాపద్మాధ•రిత్రీకళత్రా, దేవేంద్రస్తోత్రా విశ్వ•దేవీసమాఖ్యం జెప్పన్.
బై విప్పొందు న్మాయాగ•ణావాప్తి దిక్సం, ఖ్యావిశ్రామంబుల్ చోద్య•మైయుండఁ

చంద్రవర్త్మ ౧౨-౧౮౭౯

U I U ర I I I న U I I భ I I U స.

ఇంద్రవంద్య జగ•దీశ ఘనయశ, స్సాంద్ర కామెపలి•సద్మ యదువరా
చంద్రవర్త్మ యగు • శైలవిరతి ని, స్తంద్ర మై రనభ•సంబు లమరినన్.

---

1 (ప. పె) లో ౧౬౬౨ అనియే ఉన్నది. (పూ. ము) లో ౧౬౮౦ ఉన్నది. ఇదిచూచి యిటీవలివారు వ్రాతప్రతులలో సరి గానున్న సంఖ్యను తప్పుగాదిద్దుకొన్నారు.

ప్రహేయము ౧౨-౫౭౬

।।న।।నUUUమUUయ.

కరివిరమణముల్ • గా నామయుంబుల్, బరఁగ నిలుపఁ జా•పట్టుం బ్రహేయం
బరగళయన భో•జోర్వీశపుత్రీ, వరపరమకృపా•వారాశి కృష్ణా.

ప్రముదితవదన ౧౨-౧౨౧౬

।।న।।నUIUరUIUర.

మమత నిభవిరా•మముల్ గూడఁగా, జమిలినరముల౯ • సదా చెన్నగు౯
బ్రముదితవదనల్ • రమానాయకా, సుమశరజనకా • సుపర్వస్తుతా.

కుసుమవిచిత్రము ౧౨-౯౭౬

।।నUUయ।।నUUయ.

కుతలములోనం • గుసుమవిచిత్రం, బతిశుభదం బై • యగయతు లన్నం
దతనయ యొప్పు౯ • నయ లినుమా రై, సతతము విద్వ•జ్జనులు నుతింపన్.

మణిమాల ౧౨-౭౮౧

UUIతIUUయUUIతIUUయ.

కామేపలినామ•గ్రామస్థలవాసా, స్వామీ తయకార•ద్వంద్వంబు పొసంగు౯
బేమాఋమహీభృ•ద్విక్రాంతులతోడ౯•భూమండలిఁగూర్పం•బొల్చున్మణిమాలల్.

మేఘవిలసితము ౧౨-౨౦౪౧

UUUమ।।।న।।।న।।Uస.

కాళిందీముఖ•కమలమధుకరా, నాళీకాసన•నతరసవిరతు
ల్గాంల స్మేఘవి•లసితము దనరు, న్వాలాయంబు మ•నసగణములన్.

వ. త్రయోదశచ్ఛందం బగునతిజగతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదమూఁడేసియక్ష
రంబు లై యెనిమిదివేలనూటతొంబదిరెండువృత్తములు పుట్టె నందు:—

మత్తమయూరము ౧౩-౧౬౩౩

UUUమUUIతIUUయ।UసUగ.

శ్రీగోపాలా తంగెడ•సీమావనిగేహా
వాగీశాదిస్వర్గని•వాసస్తుతిపాత్రా
యోగిధ్యేయామత్తమ•యూరంబున కొప్పు౯
నాగక్రాంతు ల్మత్యగ•ణంబు ల్సగమొందన్.

### ప్రహర్షిణి ౧౩-౧౮౦౧

UUU మ I I న I U జ U I U ర U గ.

ధీరుల్ సింధురవిర ◆ తిక్షా మనజ్ర గంబుల్, సారెంబాదములను ◆ సంఘటించుచుండన్
గ్రూరారి ప్రహరున ◆ కుం బ్రహర్షణుల్పెం, పారం జెప్పదురుమ ◆ హాముదంబులోడన్.

### ప్రభాతము ౧౩-౧౩౯౨

I I I న U I జ U I జ U I U ర U గ.

మొనసి నజారగ ◆ ముల్ ప్రభాతవృత్తం, బునకు మదేభస ◆ మూహవిశ్రమంబుల్
దనరఁగ నిల్పుఁ బృ ◆ దాకురాజతల్పా, కనకమయాంశుక ◆ కామెపల్లివాసా.

### జలదము ౧౩-౩౯౪౩

U I I భ U I U ర I I I న U I I భ U గ.

బంగరుచుంగుపచ్చడము ◆ పైఁ గలయా, తంగెడదేశవాసు జల ◆ దంబులచే
తంగడు సన్నుతింతు నవ ◆ తారయతిన్, బొంగుచు సార భర్న భగ ◆ ముల్ గదియన్.

### మంజుభాషిణి ౧౩-౨౭౯౬

I I U స I U జ I I U స I U జ U గ.

ఉరగాపగాదిహరి ◆ దుర్వారాలయా, కరుణాసముద్ర మార ◆ గర్వభంజనా
యిర వొందుచుండు సజ ◆ లిబ్బడింపఁ బ్ర్మరు గాప్తిధాత్రియతి ◆ మంజుభాషిణుల్.

### రుచిరము ౧౩-౨౫౦౬

I U I జ U I I భ I I U స I U జ U గ.

గదాధరున్ జభసజ ◆ గంబులన్ గవుల్, సదా పితామహయతి ◆ సాగుచుండఁగా
ముదంబులోడ రుచిర ◆ ము ల్రచింతు రి, ట్లుదారభక్తిఁ గృతుల ◆ సర్వార్థసలిన్.

### క్షమ (క్షప) ౧౩-౨౩౬౮

I I I న I I I న U U I త U U I త U గ.

క్రమమున నిభవి ◆ శ్రాంతి నాతగయు, క్షమగ సుకవిప ◆ ద్యంబు లూహించిరన్
క్షమ ననఁ బరఁగుం ◆ గంజపత్రేక్షణా, సుమశరజనకా ◆ శూరవంశోత్తమా.

### చంచరీకావళి ౧౩-౧౧౭౩

UUU మ UUU మ U I U ర U I U ర U గ.

కంబుగ్రీవాసత్యా ◆ కామినీప్రాణనాథా, బింబోష్ఠామారాగ ◆ ల్పేర్చిభూభృద్యతుల్గాం
చుంబాదం బైధాత్రిం ◆ జంచరీకావళీనా, మంబొందుం గావ్యశ్రీ ◆ మానినీభూషణంబై.

మత్తహంసిని ౧౩-౨౭౯౦

|ᑌ|జ|ᑌᑌ|త|||ᑌ|స||ᑌ|జ|ᑌ|గ.

మనోహరాకార • మధుదైత్యసంహారా, వినాయకారూఢ • విబుధేంద్రవందితా
జనార్దనా జత్స • జగురుల్ కుభృద్యతిఁ, దనర్చుంబద్యంబు • దగు మత్తహంసినిన్.

సుమంగలి ౧౩-౧౨౭౨

||ᑌ|స|ᑌ|జ||ᑌ|స||ᑌ|స|ᑌ|గ.

సారిదిశ ధరిత్రిని • సుమంగలివృత్తం, బరయంగ సామజ • యతిఁ సజసాగల్
తిర మొంద నొప్పు వి • ధిపూజితపాదాం, బురుహద్వయా ఖర • మురాసురశౌరీ.

వ. చతుర్దశచ్ఛందం బగుశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాలుగేసియక్షరంబు
లై ౧౬౩౮౪ వృత్తములు పుట్టె నందు:—

వనమయూరము ౧౪-౩౮౩౩

ᑌ||భ|ᑌ|జ||ᑌ|స|||న ᑌᑌ గగము.

శ్రీకర ధరాధర • జిష్ణుసుత పుణ్య, శ్లోక భజసన్నగగ • లుఁ ద్రుహిణసంఖ్యా
సోడువిరమంబుగను • చున్వనమయూరా, ఖ్యాకమనువృత్తమిల • నత్తమిలుచుండుఁ.

వసంతతిలక (సింహోన్నతము, ఔద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి)
౧౪-౨౯౩౩

ᑌᑌ|త ᑌ||భ|ᑌ|జ|ᑌ|జ ᑌᑌ గగము.

శ్రీమేదినీరమణ • సింధుతరంగరంగ, ద్రామాహితల్ప విన • తానుతవాహ రాధా
కామా వసంతతిల • కఁ దభజాగగంబుల్, సామప్రభూతయతి • సాగిధరం జెలంగఁ.

భూనుతము ౧౪-౩౫౧౫

|ᑌ|ర|||న ᑌ||భ ᑌ||భ ᑌᑌ గగము.

ముష్టరించి రనభాగగ • ముల్ దశవిశ్రా, మంబుభూతలమునందున • మానితమయ్యెఁ
జాంబవత్యధిప కేశవ • సారసనేత్రా, కంబునందకగదాధర • ఖండితసాళ్వా.

సుందరి ౧౪-౫౮౧౫

ᑌ||భ ᑌ||భ ᑌ|ᑌ|ర|| ᑌ|స|ᑌ|వగణము.

సూరిజనప్రకరంబు • సుందరి నెన్నఁగా
భారసవంబులు రత్న • భాసితవిశ్రమా
ధారము గాఁ దనరారుఁ • దార్క్ష్యతురంగమా
శౌరి ముకుందమునీంద్ర • సన్నుతకేశవా.

ప్రహరణకలిత ౧౪-౮౧౨౮

। । । న । । । న ᑌ । । భ । । । న । ᑌ వగణము.

పనిగొను నెపుడుం బ్రహరణకలితన్, ననభనవలు మం దగజవిరమముల్
ఘననిభఘనవి గ్రహ బకమారమ, ర్దన మధునరక ప్రహరణకలితా.

నవనందిని ౧౪-౩౮౨౦

। । ᑌ స । ᑌ । జ । । ᑌ స । । న ᑌ ᑌ గగము.

నవనందినిన్ సజగణ స్నగగ లారయన్, నవవిశ్రమంబును ద నర్చి చెలువొప్పన్
నవనీతచోరకు జ నార్దనును పేంద్రున్, భవదూరు నెంతురు స భాసదులుభక్తిన్.

అపరాజితము ౧౪-౫౮౨౪

। । । న । । । న ᑌ । ᑌ ర । । ᑌ స । ᑌ వగణము.

ననరసలగ లొందిన న్నవవిశ్రమం, బుమ గలిగి కవీంద్ర భూషిత మై జనా
ర్దన నిగమనుగోచ రా యపరాజితం, బనఁగఁ దనరు శ్రావ్య మై వినువారికిన్.

అసంబాధ ౧౪-౪౦౬౫

ᑌ ᑌ ᑌ మ ᑌ ᑌ । త । । । న । । ᑌ స ᑌ ᑌ గగము.

వాలాయంబున్ సత్కవిజనములు వాక్రువ్వన్
వాలారున్ గోవింద వరద ధృవి వాత్సల్యా
కాళిందీప్రాణేశ మతనసగ గప్రాప్తిన్
జాలాభాస్వద్విశ్రమమునను న సంబాధల్.

కమలవిలసితము ౧౪-౪౦౯౬

। । । న । । । న । । । న । । । న ᑌ ᑌ గగము.

క్రమమున ననన న గగములు గూడన్, గమలవిలసితము కమలజవిశ్రా
మము జగతిని నగు మహితచరిత్రా, కమలదళనయన కడుఁ బొగడొందున్.

వ. పంచదశచ్ఛందం బగునతిశక్వరియందుఁ బ్రతిపాదంబునకుఁ బదిహేనేసి యక్షరంబులై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె నందు.

మాలిని ౧౫-౪౬౭౨

। । । న । । । న ᑌ ᑌ ᑌ మ । ᑌ ᑌ య । ᑌ ᑌ య.

కనకకశిపువార్తన్ గానలోలున్ శుభాంగున్
దనుజవారణదక్షున్ ధర్మమార్గానుసారిన్
మనసిజగురు నెంతున్ మాలినీవృత్త మందున్
ననమయయుగణంబుల్ నందివిశ్రాంతి గూడన్.

## సుకేసరము (భద్రకము) ౧౫-౧౧౧౮౪

।।।న∪।జ∪।భ∪।జ∪।∪ర.

సురుచిరధర్మమూల మయి♦సొంపు మీఱు నా, గిరిధర నాభిపంకజసు♦కేసరంబువై
ఖరి నజభర్రము ల్గదియఁ♦గల్పనంబునన్, గిరిశ విరామసంగతి సు♦కేసరంబునన్.

## మనోజ్ఞ ౧౫-౧౧౯౩౨

।।। న ∪ ।జ।∪। జ∪। ।భ∪।∪ర.

అజమృడవాసవసంత♦తార్చితపాదపం
కజయుగళున్ హరి నిర్వి♦కారు మనోజ్ఞ నా
బుజా వగువృత్తమునందుఁ ♦ బ్రీతి నుతింపఁగా
నజజభరంబులు వొల్చు ♦ నచ్చిన దిగ్యతిన్.

## మణిభూషణము ౧౫-౧౧౭౦౭

∪ । ∪ ర । । । న ∪ । । భ ∪ । । భ ∪ । ∪ ర.

వింత లైనమణిభూషణ♦వృత్తమునందు న
త్యంతమోదమున నెన్నను ♦ నద్దశవిశ్రమా
క్రాంత మయ్యు రనభారలఁ ♦ గంజదళాక్షుఁ గం
సాంతకు న్నరకసంహరు ♦ నార్యసమూహముల్.

## సుగంధి (*శాలినీ, చామర, ప్రశాంతి) ౧౫-౧౧౯౩౩

∪।∪ర।∪।జ∪।∪ర।∪।జ∪।∪ర.

రంబు జంబు రంబు జంబు ♦ రంబు చెన్ను మీఱఁగాఁ
దొమ్మిదింట విశ్రమంబు ♦ తోర మై సుగంధికిన్
గ్రమ్మఁగా నుతింప నొప్పుఁ ♦ గానలోలుఁ డచ్యుతుం
డంబుజాక్షుఁ డాదిదేవు ♦ డక్షరాఖ్యుఁ డెప్పుడున్.

## ఇల ౧౫-౧౯౩౯౪

।।∪స∪।జ। । ।న। । ।న।। ∪స.

గజవిశ్రమంబునఁ ♦ గనలు నిల యనఁగా, సజనాస లుండిన♦సకలకవికృత మై
భుజగాశనధ్వజు♦భుజగపతిశయనున్, వ్రజసుందరీముఖ♦వనజహితుఁ బొగడన్.

---

* ౧౧వఛందములో మఱియొకశాలినీవృత్తము గలదు. (౨౨౯ పుట)

### చంద్రరేఖ ౧౫-౪౬-౨౫

UUUమUIUరUUUమIUUయIUUయ.

మత్తేభక్రాంతిచే రమ్యం బౌనుహిం జంద్రరేఖా
వృత్తం బౌ మ్రమ్యయంబుల్ • వేడ్కఁ హృషీకేశుఁ బార్థ
క్షత్త న్నారాయణు న్విశ్వామిత్రయాగారిదైత్య
చ్ఛేత్త ద్దాశార్హ లక్ష్మీచిత్తాబ్జవాసు న్నుతింపన్.

### నలిని ౧౫-౧౪౦౪౪

IIU స IIUసIIUసIIUసIIUస.

ససపాసలచే దళవిశ్రమయు క్తతచేఁ, బొసఁగ న్నలినిన్ మణికంబు సుదర్శనహ
స్తసరోరుహువామనుఁగేశవుశౌరినజున్, వసుదేవనృపాలతనూభవుఁ బాడుదురా.

### అలసగతి ౧౫-౭౬౪౮

II ||న| |Uస II |నU| |భ|UUయ.

అలసగతి నాఁ జను సభాంతరమునందు, న్విలసదవతారయతి • నిండి నసనభ్యల్
గలయ శకటాసురవిఘాతను విశిష్టున్, బలుమఱుఁగవీశ్వరులు ప్రార్థనలు సేయన్.

### మణిగణనికరము ౧౫-౧౬౩౮౪

I I |న| I |న| I |న| I |న| |Uస.

మణిగణనికరమను లఘుగురువై, మణివిరమణమయి • మధుదనుజహరున్
ఫణిపతిశయనునిఁ • బ్రమథితనరకు, న్ఘృణిమదయుతనిభుని బొగడఁ దనరున్.

వ. షోడశచ్ఛందం బగుఅష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునాఱేసియక్షరంబులై ౬౫౫౩౬ వృత్తములు పుట్టె నందు:—

### ప్రియకాంత ౧౬-౧౩౨౬౪

I I |న|UUయ| I |న|UUయ| |UసUగ.

అమరులు భృత్యు ల్తనయ వి • యద్గంగ ధరిత్రి
కమలలు [1]పెండ్లాములు రవి • కంజారులు గన్నుల్
శమితతృణావర్తున కని • చాటుం బ్రియకాంతా
ఖ్యము శివసంఖ్యావిరమణ • మై న్యన్యసగంబై.

### పంచచామరము ౧౬-౨౧౮౪౬

|U|జU|Uర|U|జU|Uర|U|జUగ.

జరజ్రజంబులున్ గమ్ం బొసంగి తొమ్మిదింటిపై
విరామ మొంది సత్కవు ల్సవిస్తరంబు సేయఁగా

---

1 పెంళాములు.

బరాత్పరుండు మాధవుండు • పంచచామరంబునన్
బ్రరూఢగుంభనంబులంపఁ • బాడ నొప్పు ధాత్రిలోన్.

పద్మకము ౧౬—౨౩౪౧౬

III నUIIభIUIజIUIజIUIజUగ.

నభజజాగగణయుక్తిఁ బి • నాకివిరామక
ప్రభవ మై కృతుల నొప్పును • బద్మక మందమై
ప్రభుఁడు నక్రమును ద్రుంచి సు • రక్షితుఁ జేయ సా
మభవపద్మకముచాడ్పున • మానిత మై ధరన్.

చంద్రశ్రీ ౧౬-౧౦౧౭౮

IUUయUUUమIIIనIIUసUIUరUగ.

క్షమం జంద్రశ్రీతోయమనసర • గల్బానువిశ్రా
మముల్ సంబంధించు న్నరహరి ర • మాచిత్తచోరా
శమిూయామ్యాగారా శమనసమ • జానాథకృష్ణా
పరిమత్తకరివ్యాదక్షణదళన • రాధాభుజంగా.

మేదిని (వాణి) ౧౬-౧౧౧౮౪

IIIనIUIజUIIభIUIజUIUరUగ.

మృడయతి నజ్భజర్గములు • మేదినిసమాఖ్యన్
దడబడుచుండఁగాఁ దనరు • దంష్ట్రి పద్మనాభా
జడనిధితల్ప నందసుత • సాళ్వరాట్కృతాంతా
కడు హితభక్తి నీకు నతి • గావుమయ్య దేవా.

ఫలసదనము ౧౬-౧౬౩౮౪

IIIనIIIనIIIనIIIనIIUసUగ.

ననననసగములు ద • నరఁగ దళవిశ్రాం
తిని ఫలసదనము ల • లితయ మగుచొప్పన్
మునిజనహృదయములఁ • బొలుచువానిన్(?)
గొనబుగముద మొదవఁ • గొలిచెద మటంచున్.

అశ్వగతి ౧౬--౨౮౦౮౭

UIIభUIIభUIIభUIIభUIIభUగ.

అందము లైనభకారము • లైదును గాంతము లై
పొంది పదింట విరామముఁ, • బూనినయశ్వగతిం

గందసమానమహోన్నత • గాత్రుని శౌరిని గో
విందునిఁ బ్రస్తుతి సేయఁగ • వేడుక యయ్యెఁ జామీ.

మదనదర్పణము ౧౯ - ౨౧౮౫౫౭

U॥భ॥Uస॥Uజ॥U॥Uర॥ Uజ U గ.

చారుమదనదర్పణంబు భ • స్జరజగము ల్దగుణ్
మారవిమతవిశ్రమంబున • న్మహిం జెలంగు నా
ధీరుల యమునాతటంబునం • బ్రియంబుఁ జేసి యా
ధీరవరుఁడు గూడె నంచు భ • క్తి సన్నుతింపఁగా.

గజవిలసితము ౧౬-౩౨౭౬౮

UU॥భ U॥Uర॥॥న॥॥న॥॥న॥॥న U గ.

బాలసరోజనాభ • వరద తనుమిళితజం, బాల దిగంబరా స • మసృణకబళకర లం
బాలక మంగళావ • హ గజవిలసితమున, గ్గారిలు భరేఫనాన • నగము లిభవిరమ మై.

వ. స్పష్టదళచ్ఛందం బగుఅత్యష్టియందుఁ బ్రతిపాదంబునకుఁ బదియేడేసియక్షరంబు లై ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె నందు:—

శిఖరిణి ౧౭-౫౯౩౩౦

I UU యUUU మ॥ ॥న॥ U స U॥ భ॥ U గణము.

భజింతు న్నిత్యంబు న్మనిజనసదా • ప్రార్థనపరుణ్
గజేంద్రార్తిధ్వంసిం గృతకలనా • గ్రావు నజరుణ్
ద్విజశ్రేష్ఠుల్ మెచ్చ న్యమనస భవల్ • విశ్వవిరతి
ప్రజాతాహ్లాదం బై శిఖరిణి యనా • భాసుర మగున్.

పృథ్వి ౧౭-౩౮౭౪౦

I U I జ I I U స I U I జ I I U స I UU య I U వగణము.

జసల్ జసయవంబు లుష్ణకర • సంఖ్యవిశ్రాంతులుణ్
బొసంగి కవిపుంగవుల్ పలుక • భూమిలోఁ బృథ్వి నా
వసంశయ మగుం గళిందతన • యామనోవల్లభా
ప్రసన్నవదనాంబుజా ధృత • పరశ్వధా మాధవా.

హరిణి ౧౭-౪౬౧౨౨

I I I న I I U స UUU మ U I U ర I I U స I U వగణము.

హరిణి యనువృత్తం బొప్పు న్నభస్మ • రాత్తవిరామ మై
సరి నసమరేఫస్వం బై షోడ • శప్రమదాసవా

స్రరమణుఁ దృణావర్తక్రవ్యాద•సంహారు మస్తకో
పరిరుచిరపింఛాచూడుం బీత•వస్త్రు నుతింపఁగా.

### నర్కుటము (కోకిలకాకము) ౧౭-౫౬౨౪౦

।।।న।∪।జ∪।।భ।∪।జ।∪।జ।∪వగణము.

కొలిచెద నాదిదేవుపద•కోకనదంబులు నేఁ
దొలఁచెదఁ దొంటిబామునఁ గు•దుర్వడుపాపములం
దలఁచెద నామధేయ మతి•తత్పరత న్జభజా
వలఁ దగునర్కుటంబునకు • భర్గవిరామములన్.

### మందాక్రాంత ౧౭-౧౮౯౨౯

∪∪∪మ∪।।భ।।।న∪∪।త∪∪।త∪∪గగము.

మందాక్రాంత న్గిరిశవిరతు • ల్మభ్నతాగాగణంబుల్
పొందె న్సాందీపునివలన సం•పూర్ణవిద్యాచయంబుల్
బృందించె న్ద్వారుణరణమునం • జొంద్రసాళ్వాదులం జే
యందెం జేరం డడుకులకు నం•దాత్మజుం డంచుఁ జెప్పన్.

### పాలాశదలము (త్వరితగతి) ౧౭.౩౨౭౬౮

। । । న । । । న । । । న । । । న । । । న∪∪ గగము.

అదనదనున హరిసుతు • లమర ధరఁ బాలా
శదళ మనఁ దనరుఁ గవి•జనులు వచియింపన్.
బదునొకఁ డగునెడ యతి • పదిలమునఁ జేరన్
గదియు నగణములయిదు • గగము తుద నొందన్.

### వంశపత్త్రపతితము ౧౭-౬౪౯౮౩

∪।।భ∪।∪ర । । । న∪ ।। భ । । । న న । ∪వగ.

బాగుగఁ జెప్ప నొప్పు వసుధన్ • భరనభనలగల్
సాగి పినాకివిక్రమమునన్ • సభలనుఁ గుదురై
రాగిలువంశపత్త్రపతిత • ప్రణామున నరకు
న్ప్రాగతనంబునం దునిమె నం•దతనయుఁ డనినన్.

చంపకకేసరి ౧౭-౪౬౭౨౭

॥Uస।U।జ॥Uస॥Uస।Uవగ.

సనకాదియోగినుతు • జాంబవతీప్రియు నిర్విక
ల్పు నమేయు నక్షర వి•భు న్యమళార్జునభంజనుఁ
వనమాలిఁ గృష్ణు ముర•భంజను నెంతురు వారిజా
సనవిక్రమంబు సజ•సాస్వలు చంపకకేసరిన్.

వ. అష్టాదశచ్ఛందం బగుధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బదునెనిమిదియక్షరంబులై ౨౬౨౧౪౪ వృత్తములు పుట్టె నందు:—

మత్తకోకిల ౧౮-౯౩౦౧౯

U।Uర॥Uస।U।జ।U।జU॥భU।Uర.

అత్తమిల్లు మహేశవిక్రమ • మార్యసమ్మతి నొప్పఁగా
సత్తులౌ రసజాభరేఫలు • చాళలింపుచు నొందఁగా
మత్తకోకిలవృత్తపద్ధతి • మక్కువం బొనరింపఁగా
హత్తి పూజ యొనర్ప వచ్చు జ•నార్దనాహ్వయు నెప్పుడున్.

కుసుమితలతావేల్లిత ౧౮-౩౭౮౫౭

UUUమUU।త॥।నUUయ।UUయ।UUయ.

వేమా రెన్నంగాఁ గుసుమితలతా•వేల్లిత న్మత్నయాయల్
శ్రీమార్తండక్రాంతియుఁ గుదిరినం • జెన్ను మీఱు న్ధరిత్రిన్
గామేపల్లీశుం గనకవసనుం • గంజనేత్రున్ శుభాంగున్
గోమద్భాలుం గాలయవనహరుం • గుంజరేంద్రార్తినాశున్.

నిశి ౧౮-౭౪౯౪౪

॥।న॥।నU।Uర U।Uర U।Uర U।Uర.

ప్రబలు నిశను నార•రారంబుల నిత్తనవిశ్రాంతియున్
గబళితదవపావ•కాపూతనాజీవితాహారి కృ
ష్ణ బలసహజ పారి•జాతాపహారా యదుశ్రేష్ఠ దే
వబలదమనవంద్య • బంహిష్ఠ వార్ష్ణేయ శైనేయకా.

హారనర్తనము ౧౮-౯౦౯౭౧

U।Uర॥Uస।U।జ।UUయU॥భU।Uర.

దావపావకఖాది మా•ధవ దాశార్హా•దనుజాంతకా
దేవకీప్రియనందనా•దివిషద్వంద్యా•ధుత్రివసన్నుతా

భావగోచర విశ్వరూ । ప దగు న్వాయస్త్రివ్వ నవ ర్తసం
ఖ్యావిరామము రేఫస । జ్యభరేఫంబుల్ । హారన ర్తనన్.

త్స్వాహారము ౧౮-౩౦౮౪౧

UUU మ III న I UU య UU I త III న UUU మ.

బాహాబాహిని దమలో । భాగ్రితల్ దొడ్డ । పగలఁ బోరాడం
గా హంవీరుఁ డగుబుభు । క్షానూనున్ జ । గతిని గూలంగా
నాహా యేసినరపా । లా రత్నేషు । యతులు పొందంగా
త్స్వాహారంబు మనయత । న్మంబుల్ చెంది । [1]మనును నందం బై.

వ. ఏకోనవింశతిచ్ఛందం బగునతిధృతియందుఁ బ్రతిపాదంబునకుఁ బందొమ్మిదేసి యక్షరంబు లై ౫౨౪౨౮౮ వృత్తములు పుట్టె నందు:—

శార్దూలవిక్రీడిత ౧౯-౧౪౯౩౩౭

UUU మ II U స I U I జ II U స UU I త UU I త U గము.

నీరేజాంచితలోచనాయ హరయే । నీలాంబుదాంగాయ మా
యారాత్రించరఖండనాయ విభవే । హార్యక్షవక్త్రాయ తా
ర్క్ష్యారూఢాయ యటంచుఁ గూర్తురు నిరీ । హా విశ్వవిశ్రాంతి వి
స్తారింప న్మసజ స్తతంబులు గము । న్శార్దూలవిక్రీడితన్.

తరళ ౧౯-౧౮౭౦౪౮

III న UII భ UIU ర IIU స IUI జ UIజ U గము.

జలజలోచనుఁ గైటభాంతకు । శంఖచక్రగదాధరున్
గలశజాదిమునీంద్రసేవితుఁ । గాళియాంతకు నచ్యుతున్
బలుకుచోఁ దరళంబు లందుల । భానువిశ్రమపద్ధతిన్
గలియ నభ్రసజాగముల్ సమ । కట్టి చెప్పుదు రుత్తముల్.

మేఘవిస్ఫూర్జితము ౧౯-౭౯౭౭౧౪

I UU య UUU మ III న IIU స UIU ర UIU ర U గ.

క్షమాలక్ష్మీనాథున్ విదురవరదున్ । జాహ్నవీజాతపాదున్
సమామ్నాయస్తవ్యున్ గరుడతురగున్ । సామజప్రాణదాతన్
మిముం దాఁ జేర్కొన్న న్సభలఁ దనరు । న్మేఘవిస్ఫూర్జితంబుల్
విమర్శం గూర్పన్ యమ్నసరరగము । ల్విశ్వవిశ్రాంతిచేతన్.

1 కనలు.

### చంద్రకళ ౧౯-౧౮౬౭౮౭

U|Uర||Uస||UసUU|త|U|జU|జUగ.

తానకంబుగఁ జంద్రకళావృ • త్తంబు కవు ల్విరచించిరన్
నీసులార మనోజ్ఞపదంబుల్ • పేర్చి కపర్ది విరామ మై
కాన వచ్చి రసస్తజజంబుల్ • గంబు దనర్చి కళిందజా
మానినీరమణస్తవగాథా • మానితరత్నములం దగున్.

### భూతిలకము ౧౯-౧౮౬౦౩౯

U|భU||భU|Uర||Uస|U|జ|U|జUగము.

భారసజాగగణంబులుం బఱ•వంగ భానువిరామవి
స్ఫారత భూతిలకంబు పాండవ•పక్ష దైవతవృక్ష మిం
పార ధరిత్రికిఁ దెచ్చినట్టిమ•హాత్ము యంచుఁ గవీశ్వరుల్
చారుపదంబులు గూర్చి చెప్పిన • శ్రావ్య మౌ వినువారికిన్.

### కవికంఠభూషణము. ౧౯-౧౭౭౯౦౦

||Uస|U|జ||Uస||Uస|U|జUగ.

నవరత్నవిశ్రమము•నన్ సజసాసజగంబులన్ గవుల్
గవికంఠభూషణము•గా రచియింతురు మాటిమాటికి
న్రవణిల్లు కబ్బమున • నందకపాణి నుపేంద్రు రుక్మిణీ
ధవు సత్కథాసుధలఁ • దత్పరు లైన మహాత్ము లట్లుగాన్.

వ. వింశతిచ్ఛందం బగుకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదేసియక్షరంబు లై ౧౦౪౮౫౭౬ వృత్తములు పుట్టె నందు:—

### మత్తేభవిక్రీడిత ౨౦-౨౯౮౬౭౬

||UసU||భU|Uర| ||నUUUమ|UUయ|Uవగణము.

మనువిశ్రాంతిని సభ్రనమ్యవములన్ • మత్తేభవిక్రీడితా
ఖ్యాను వృత్తంబు చెలంగె మానవతులా•రా వీఁడె యేతెంచె భ
క్తిని గాత్యాయనిఁ గొల్చునాఁడు యమునా•తీరంబునం బొంది వే
డ్కను మాచీరలు దోఁచుకొన్న వెడదొం•గం జూచినారా యనన్.

---

1 తవరారునటుగాన్.

ఉత్పలమాల ౨౦-౩౫౫౬౯

U।।భU।Uర।।।నU।।భU।।భUUర।Uవగణము.

పేరిన నేయిదుగ్ధములు • పెర్గును మీఁగడయు న్సదా వ్రజా
గారము సొచ్చి త్రాగి వెస • గంతులు వైచుమురారి నెంచఁ గా
ధారుణి రూఢి కెక్కునవ • తారవిరామముచే లసద్భర
భారలగంబులుం గలయఁ • బల్కిన నుత్పలమాల చెన్నగుఁ.

అంబురుహాము ౨౦-౩౬౨౧౫౧

U।।భU।।భU।।భU।।భU।Uర।।Uస।Uవగము.

చారుతమాలదళానితవర్ణునిఁ • జక్రహస్తుసనాతను
న్దారితకంసముఖక్షితిపాలకు • నందనందను నవ్యయుఁ
ఘోరకులోద్భవుఁ గైటభభేదిని • బోలి చేసి నుతింప భా
భారసవంబులు విశ్వవిరామముఁ • బల్కు నంబురుహం బగుఁ.

ఖచరప్లుతము ౨౦-౩౬౩౧౬౮

।।।నU।।భU।।భUUUమ।।Uస।।Uస।Uవగ.

యమునలోఁ జొర నోడిననానా • ప్రాకృతజంతువులం బ్రమో
దమునఁ బ్రోచుటకై కలఁచంగా • దర్పమునం జనుదెంచి ఘో
రముగఁ జుట్టినకాళియు సంహా • రం బొనరించినకృష్ణ య
*ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ • రాజిలనా ఖచరప్లుతః.

ప్రభాకలిత ౨౦-౩౬౨౦౬౯

।।।న।Uజ।Uజ U।।భU।Uర।।Uస।Uవగము.

వళి పదమూఁడవయక్కరంబుగ • వాని కెక్కు నజాభరే
ఫలు సలగంబు లమర్చి సొం పాద • వం బ్రభాకలితాఖ్య మై
చెలు వగువృత్తమునందు సత్కవి • శేఖరు ల్వినుతింతు రా
జలనిధిమీఁదను బవ్వళించిన • జాంబవత్యధిపాలునిఁ.

వ. ఏకవింశతిచ్ఛందంబగు ప్రకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియొక్క యక్ష
రంబులై ౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టె నందు:—

---

* ర్యమవిరామముతోడ నభామ్స • స్వల్వెలయుఁ (పూ. ము.) ఇందు యతి
తప్పినది ; ర్యమవిరామముతోడ నభామ్సస్వల్ • రాజిలనా (ప. ఓ. పె.) ఇందు
గణము తప్పినది.

చంపకమాల ౨౧-౭౧౧౬౦౦

|||న|∪|జ|∪||భ|∪|జ|∪|జ|∪|జ|∪|∪ర.

చపలమనీషతోడ నొక • సంయమి వే మొలఁ బెట్టుచుండఁగాఁ
గృపను దదీయపుత్త్రిఁ బ్రతి • కించినమేటివిభుండ వంచు నీ
సపరిగణంబుతో నజభ • జాజలు రేఫయుఁ గూర్చి సత్కవుల్
త్రిపురవిభేదనాఖ్యవిర • తిం దగఁ జంపకమాలఁ గొల్తు రా.

వనమంజరి ౨౧-౭౪౪౩౦౪

|||న|∪|జ|∪|జ|∪|జ|∪|జ|∪||భ|∪|∪ర.

మనువిరతు ల్నజజాజభర ల్వన • మంజరిం గవిశేఖరుల్
దనరఁగ నాజయుఁడు న్విజయుం డను • ద్వారపాలకు లిర్వురు
న్సనకునిశాపము దాఁకి నిశాటు ల • నంగఁ బుట్టి సుపర్వులన్
జెనకినవాండ్రను జంపినకోలన్ృ • సింహుని న్వినుతింతు రా.

* స్రగ్ధర ౨౧-౩౦౨౯౯౩

∪∪∪మ∪|∪ర∪||భ|||న|∪∪య|∪∪య|∪∪య.

మానొందున్ స్రగ్ధరాఖ్యన్ • మరభనయయయల్ • మత్తనాగాష్టవిశ్రా
మానూనప్రాప్తులైనన్ • హరిముఖదివిజుల్ • యాతుధానవ్రజంబుల్
సానందాసక్తితోఁ దో • యధికడ నమృతం • బారగింపంగ నచ్చో
మానిన్యాకారతన్ స • మ్మదమువొదలఁ బం • ద్మాధవానందపుత్త్రా!

లాటీవిటము ౨౧-౩౯౪౯౭౨

||∪స||∪స||∪స||∪స∪∪∪మ∪∪|త|∪∪య.

సగణంబులు నాల్గిట మత్యలవి • శ్వవిశ్రాంతి న్లాటీవిటవృత్తం
బగు నంచుఁ గవీంద్రులు గొల్తురు స • మ్యక్ప్రీతి న్యాచించి యథేచ్ఛం
దగునేర్పున మూఁడు పదంబులుగాఁ • త్రైలోక్యంబు [2]గ్గాల్చి సురారుల్
వొగలం బలిదానవుఁ ద్రొక్కి నయా • పాట్టిం దిట్ట న్వామనుఁ గృష్ణున్.

మణిమాల ౨౧-౯౬౫౩౫౬

||∪స|∪|జ||∪స|∪|జ||∪స|∪|జ||∪స.

అజహాత్ప్రయోదధిఘృతంబు • లమ్ముచు మురారిఁ బాడి రెలమిన్
వజఁగాఁ దదీయచరణా త్త • నవ్యహృదయారవింద లగుచు

* ఇది (పూ. మూ)ల లో లేదు. (ప) లో ఉన్నది. 2 (పూ మూ.)లలో—గొల్వఁ గఖూరుల్.

స్వాత్రిజసుందరీజనము లొక్క—•నాఁడు మణిమాలయందుఁ బొసఁగ
న్నజము త్రివారము సముం బి•నాకివిరమంబు పొందు దనరఁ.

కరిబృంహితము ౨౧-౭౮౨౨౭౧

U||భ|||నU||భ|||నU||భ|||నU|Uర.

మూఁడు భనములు రేఫమును బదు • మూఁట విరతియు సొంపుగాఁ
గూడుకొనఁ గరిబృంహితము సమ•కూర్చి వసుమతి మండలా
పీడ మనుకరిబృంహితరవము • పెల్లుగఁ బలుకుచుండఁగాఁ
గోడిగవు[1]చిననాఁడు శకటునిఁ • గూల్చినహరి నుతించెదఁ.

కనకలత ౨౧-౧౦౪౮౫౭౬

|||న|||న|||న|||న|||న|||న||Uస.

జవమున భగభగ యనుచు ప్ర•జజనములఁ బొదవినం
దవశిఖి నుడిపినమధుముర • నరకదమన యని పే
లవముగఁ బలుమఱు నిరువది • లఘువులు గము పదుమూఁ
డవయెడ విరతిఁ బొసఁగిన బెఁ•డఁ గడరుఁ గనకలతఁ.

వ. ద్వావింశచ్ఛందం బగునాకృతియందుఁ బ్రతిపాదంబున కిరువదిరెండేసి యక్షరం
బులై ౪౧౯౪౩౦౪ వృత్తములు వుట్టెనందు:—

మహాస్రగ్ధర ౨౨-౧౨౦౪౦౦౪

||UసUU|తUU|త|||న||UసU|UరU|UరUగ.

స్తతనస్రాగ ల్విరించా•ష్టవిరతులు మహా•స్రగ్ధరం జెప్ప నొప్పుఁ
గ్రతువిఘ్నుం బావహిల్లం • బ్రమదమున వ్రజ• వ్రాతదత్తాన్న మెల్లఁ
క్షితిభృద్దర్పంబున న్మా•క్కిన రుష నమరా•గే౨సరుం డంప మ్రబ్బల్
ధృతిమై జాల్వానఁ [2]గూల్పఁ • దివిరి కరుణతో•[3]ధేనువృద్ధ్యద్రి మోఁచెఁ.

భద్రకము ౨౨-౧౯౩౦౭౧౧

U||భU|Uర|||నU|Uర|||నU|Uర|||నUగ.

భంబు రనత్రయంబు గము నొంది • భానుయతి భద్రకంబు దనరుఁ
బంబినపిల్లగోల కరయుగ్మ • పాదములఁ బట్టి యూఁది పశువ
ర్గంబు నరణ్యమధ్యమధరిత్రిఁ • గాచుసమయంబున న్యమున తీ
రంబున గొల్లలం గలసి యోగి•రంబు దినెఁ గృష్ణుఁ డంచుఁ బలుకఁ.

---

1 చిననాడుటకుసల. (పె). 2 గూల్పఁ (ఓ); గూల్వఁ(ప) గుర్వఁ (పూ.
ము). 3 ధేనువర్ధాద్రి (పూ.ము).

మానిని ౨౨-౧౭౯౭౫౫౯

∪||భ∪||భ∪||భ∪||భ∪||భ∪||భ∪||భ∪గ.

రాజిలు సప్తభము ల్గము విశ్వవి•రామము మానినియందు భర
ద్వాజముఖప్రముఖేశ్వరు లందఱు • దైత్యగురుర్ భృగువాక్యమునన్
రా జలనాయకతల్పుని దైవత•రాజు నజప్రము గొల్తురు వి
భ్రాజితమోక్షము చేకుఱఁ బుణ్యధ•రాస్థలి నంచు వచించుటచేన్.

విచికిలిత ౨౨-౨౦౯౭౧౫౨

|||న|||న|||న|||న|||న|||న|||న∪గ.

ప్రవిలయసమయమునను బద•పడి జలనిధినడుమ స
ద్భువనములు కడుపున నిడుక • భుజగపతిశయనముపై
నవిరళమతిఁ గురుకువరదుఁ • డని విచికిలితఁ బదుమూఁ
డవయెడ వడి యిరువదియొక•లఘువు గము బలుక నగున్.

తురగము ౨౨-౧౪౯౦౯౪౪

|||న|||న|||న|||న∪స∪|జ∪|జ∪గ.

ననననసజజగలు తిథివిరమ•ణం బగు న్దురగంబునన్
గనలుచు నగరముపయి విడిసిన • గాంచి తా నొకరుం డెదు
ర్కొని దవులకుఁ గొని చని గిరిగుహఁ • గూర్కునామచికుందుచే
తను యవనునిఁ బొరిగొని తని వసు•ధ న్గణింతురు భూసురుల్.

[1]మద్రకము ౨౨-౧౯౩౦౭౧౧

∪||భ∪|∪ర|||న∪|∪ర||∪స|∪స|||న∪గ.

అధ్వమునందు నడ్డ మయి వా•హనాకృతి నున్న బకాసుర మహా
సాధ్వసదు న్వ్రజార్భకవినా•శనక్షము వక్త్రముఁ జొచ్చి సురలున్
శ్రాధ్యగు లై నుతింపఁగఁ దదీ•యదేహము వెళ్లినఁ గృష్ణునుతి న
శ్రధ్వజమద్విరామము భర•న్రసానగలుం దగుమద్రకమునన్.

వ. త్రయోవింశతిచ్ఛందం బగు వికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదిమూఁడేసి యక్షరంబు లై ౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె నందు:—

1 ఇది (ప) లో మహాస్రగ్ధర తర్వాత ఉన్నది.

### కవిరాజవిరాజితము ౨౩-౩౫౯౫౧౨౦

IIIన|U|జ|U|జ|U|జ|U|జ|U|జ|U|జ|Uవగణము.

కలయఁగ నొక్క న•కారము నాఱుజ•కారములు న్వమ • గాటముగా
నలరినచో ద్విర•దాచలశైలము • లై త్రివిరామము • లంది నిర
ర్గళకవిరాజవి•రాజితవృత్తము • రాణ జనార్దన రమ్యకథా
వళులఁ గవీశులు • వర్ణన సేయఁగ • వ్రాలు నజప్రము • వావిరిగన్.

### అశ్వలలిత ౨౩-౩౮౬౧౪౨౪

IIIన|U|జU||భ|U|జU||భ|U|జU||భ|Uవగ.

సలలితవిశ్వవిశ్రమము నజ్భ•జల్భజభవంబు లశ్వలలితన్
కెలువుగఁ గూర్చి సత్కవులు తల్లి • చిన్నిసమయంబునందున సులూ
ఖలమునఁ గట్టి వైచినను నీచ్చు • [1]కన్దరలి మద్దిచెట్లు ధరణిం
గలపినకృష్ణుఁ గీర్తనము సేయుఁ • గాఁ దనరు సర్వకాలము ధరన్.

### పద్మనాభము ౨౩-౧౧౯౮౩౭౩

UU|తUU|తUU|తUU|తUU|తUU|తUU|తUUగగము.

వేమాఱు నప్పద్మనాభంబున న్విశ్వ•విశ్రాంతియు న్సప్తతంబు ల్గగంబున్
గోమారుగా దేవశాత్రించరుల్ క్షీర•కూపారమధ్యంబున న్వేఁపుమీఁదన్
భ్రామంగ మంథాచలం బోపికం గచ్ఛ•పస్వామి యై మోచె నీకృష్ణుఁ డంచున్
గామించి విద్వాంసు లెల్ల న్వచింపంగఁ • గ్రాలు న్ధరిత్రి న్సదా మానితం బై.

### మత్తాక్రీడ ౨౩-౪౧౯౩౦౪౯

UUUమUUUమUU|త|||న|||న|||న|||న|Uవగ.

మత్తాక్రీడాఖ్యం బెం పారు • న్మమతననననవ • మహిత మగుచు ర
త్నాత్తబ్రహ్మాణ్డింతు ల్గ్రిం దై • యమరగ రణమున • నధికబలు మదో
న్మత్తుం జాణూరక్రవ్యాదు • న్మనురనమునఁ బెడ • మరలి పిడికిటన్
సత్తామాత్రుం డుర్విం గూల్చె • న్సకలదివిషదులు • సమతను బొగడన్.

వ. చతుర్వింశతిచ్ఛందం బగుసంకృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదినాలుగేసియ
క్షరంబు లై ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె నందు:—

---

1 (ప) లో పాఠము ఇందులకు భిన్నముగానున్నది కాని దానిపై గీతలు గీచి యుండుటచే స్పష్టముగాలేదు. మఱికొన్ని తాటాకుపుస్తకములు చూడవలెను.

సరసిజము ౨౪-౮౩౮౮౧౯౩

∪∪∪మ∪∪∪త∪∪∪య|||న|||న|||న|||న∪స.

సంబంధించు న్మత్యలు నానా॥సలు దశనిధియతి ॥ సరసిజమునకుఁ
గంబూర న్బృందాటవిలోనం ॥ [1]గవిసికొనినసుర॥కరువలిదనుజుఁ
శంబాఖీలం బై తగుముష్టిం ॥ జదిపినయదుపతి॥ స్తవములు ననురా
గం బూర న్శోభిల్లఁగఁ క్రొంచ॥త్కావివరు లభినుతిఁ ॥ గలిపుదు రవనిఁ.

క్రౌంచపదము ౨౪-౪౧౯౩౪౬

∪||భ∪∪∪మ||∪స∪||భ|||న|||న|||న∪∪య.

పంచమకేశుం డిచ్చినభాస్వ॥ద్వరమున మనమున ॥ బవరము గోరఁ
వంచనతో బాణాసురహ స్త॥వ్రజములు దరిగెను ॥ వడి హరి యంచు
న్బాగించితలీల న్శంకరనంది॥ ప్రకటితవిరతులు ॥ భమసభనాన్యల్
క్రౌంచపదీవృత్తమ్మునఁ జె న్నా॥రఁగఁ బలుకుదు రిలఁ ॥ గవివరు లెల్లఁ.

తన్వి ౨౪-౪౧౭౭౩౬౨

∪||భ∪∪త|||న||∪స∪||భ∪||భ|||న∪∪య.

దూడలతోఁ గాపరులను గుహాలో ॥ దొంగిలిదాచినవిధి నదలింపఁ ;
గూడుక తద్రూపను లయి పసులుం ॥ గోపవధూటులు మురిపము నొందఁ
బాడి వినోదంబులు సలిపినగో॥పాలుఁ డటంచును భతనసభాన్యల్
దాడి గొన న్విశ్వవిరమణముతోఁ ॥ దన్విని జెప్పఁగఁ దనరుఁ గవీంద్రుల్.

అష్టమూర్తి ౨౪-౩౬౧౪౭౨౧

∪∪∪మ|||న∪∪త||∪స∪|∪ర∪||భ|∪జ|∪∪య.

శ్రీకృష్ణుం గనకవస్త్రుం ॥ జితతృణావర్తదైత్యు ॥ న్సితకుశేశయనాభుఁ
వైకుంఠు న్వరదు బృందా॥వనచరు న్వాసుదేవు ॥ న్వసుమయుం బరముం బ
ద్మాకాంతు న్నిధినిధానా॥మలవిరామంబు లొప్ప ॥ న్మనతసర్భజయుంబుల్
సోకం జెప్పుదురు విద్వాం॥సు లిలలో నష్టమూర్తి॥న్సుప్రతిభు ల్కృతచర్యుల్.

వ. పంచవింశతిచ్ఛందం బగు నతికృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదియైదేసి యక్షరంబు లై ౩౩౫౫౪౪౩ వృత్తంబులు పుట్టె నందు:—

బంధురము ౨౭-౧౪౩౬౮౨౬౮

|||న|||న|||న|||న∪స∪||భ∪||భ∪||భ∪గ.

సారిది ననననసభభభగములతో ॥ షోడశసంఖ్యవిరామముతో
ఖరువడి దినదినము బుధజను లీ॥బంధురవృత్తమునందు నుతిం

1 గవసు (వ).

తురు హిమకరకుసుమము నొసటను గన్ను ఫణిపొగయుఁ దాల్చినయా
దొరజడలనడుమనిలిచిన తెలుపుం దూకొనువాఁగుకుఁ దండ్రి యనన్.

భాస్కరవిలసితము ౨౫-౭౩౭౧౩౧౧

U॥భ॥న॥U॥జ॥UU॥య॥U॥భ॥న॥న॥U॥స॥U॥గ.

చెల్లెలి విజయున కిచ్చినవానిం జేరెడుపృథుకములు దినినవానిన్
గొల్లతలను వలపించినవానిం గొల్లకుఁ గొడు కనఁ బరఁగినవానిన్
మల్లుర రణమునఁ జంపినవాని న్భజ్జయభననసగలు పదుమూఁటన్
బల్లిద మగువిరమంబు దలిర్ప న్భాస్కరవిలసితములు గొనియాడున్.

ధరణిధరగతి ౨౫-౧౬౪౪౪౨౧౬

॥న॥న॥న॥న॥న॥న॥న॥న॥U॥గ.

వసునములు గమ వసువసుయతులు వల నగు ధరణిధరగతిన్
గస లొదవి సుడి కరువలిపగిదిఁ గదసి యదుశిశుచయముతో
§మసలెడునెడ మురమథన నినుఁ గొని మదిని నలరుచు నెగసి యా
కసమున కెగయఁగ శకటదనుజాత్మఁ గలిపితి వని పలుకన్.

వ. షడ్వింశతిచ్ఛందం బగునుత్కృతియందుఁ బ్రతిపాదంబునకు నిరువదాఱేసి యక్షరంబు లై ౬౭౧౦౮౮౬౪ వృత్తంబులు వుట్టె నందు:—

భుజంగవిజృంభిత ౨౬-౨౩౮౭౪౮౭౪

UUU॥మ॥UUU॥మ॥UU॥త॥న॥న॥న॥U॥U॥ర॥U॥స॥U॥వ॥గ.

వ్రాలు న్రత్నైకానక్రాంతుల్వాహి మమతననరసవల్ భుజంగవిజృంభితన్
గాళిందీయోషం బెండ్లాడ న్ఖరదనుజుఁ దునిమెను శిఖావలాంచితపింఛమున్
మాళిం దాల్చె న్పండిం ద్రోచె న్మఱఁదికి రథముఁ గడపె మద్దిచెట్లులు రెండు ని
ర్మాలిం చెన్దాలంబుల్గూల్చెన్ మొగుదలు భ్రమయమురళి మ్రోయఁజేసె విభుండనన్.

వరాహము ౨౬-౭౩౮౭౬౦౧

UUU॥మ॥న॥న॥న॥న॥న॥న॥U॥స॥UU॥గ॥గ.

రాజిల్లు న్గళకుధరవిరతులు మగణరసనసగగలు వరాహాఖ్యన్
జేజే లందఱు పొగడ నుచితుఁ డని తలఁచి భృగువు పలుకఁగ నిత్యంబున్
తేజశ్శ్రీ పెరుగఁగ మదిదృఢముగ నిడితిమురుచుఁ గొలిచిరి దాశార్హున్
రాజీవాక్షుని నరహరి రవికులవరు రఘుపతి బలసహాజున్ గృష్ణున్.

§ ఇచ్చటగణభంగము. 1 మద్దిచెట్టులఁగూలిచెన్, దాలంబుల్గూల్చె న్వేగన్ మొగ్గలు భ్రమయఁగను మురళిదాలిచెన్ సువిభుండనన్.(పూ.ము). 2 ధృవముగ(ప).

## మంగళమహాశ్రీ [illegible]

U।।భ।U।జ।।U।స।।।నU।।భ।U।జ।।U।స।।। నUUగగము.

పొత్తు లెడఁబాయుటను • బోరుసమయంబునను • బొంగుచుఁ గురూద్వహుల నెల్లన్
దుత్తుమురు సేయఁగఁ గు • దుర్చును మనీష నది • దుష్టసమరావనిఁ గిరీటి
క్షత్త్రకు భజసనభజ • సానగలు మణ్యాజుల • క్రాంతులును మంగళమహాశ్రీ
వృత్తములఁ జెన్నలర • నిచ్చిరి సువాసినులు • నిం పడర మంగళమహార్తుల్.

క. పొందుగ నిరువదియా ఱగు, ఛందములం దుదయ మైన • సమవృత్తము లా
నందమునఁ గవులు పొగడెదు, కందువల వచించినాఁడఁ • గా మెపలీశా. 178

వ. ఇవి సమవృత్తలక్షణంబు లింక ముఖ్యగౌణవృత్తలక్షణంబు లెఱింగించెద. 179

## ముఖ్యగౌణవృత్తలక్షణము.

సీ. సమవృత్తపఙ్క్తి—స్వ • స్థానార్ధసమములు స్వస్థానవిషమాఖ్యఁ • జనఁనవియును
బృథివిపై సమవృత్త • భేదంబు లీమూఁటి కక్షరంబులు సమం • బన్ని కాళ్ల
నివి వృత్తముఖ్యంబు • లిఁకఁ బరస్థానార్ధసమవృత్తములు పర • స్థానవిషమ
సంజ్ఞలఁ బద్యము • ల్సర్వపరస్థానవిషమంబులును నివి • విషమవృత్త
తే. భేదములు వీనినాలుగు • పాదములను, సమముగాఁ జూపడవు వర్ణ • సంఖ్య లెచ్చు
కడమ లై యుండు నీమూఁటి • గౌణవృత్త, పద్యములటండ్రు శ్రీకామె • పల్లినిలయ.

## సమవృత్తవివేకము.

గీ. జగతి సమవృత్త మెన్నవ • ఛందమునను, సంభవము నొందె నన్ని య • క్షరము లమరఁ
బదపదంబున హెచ్చును • గొదువ గాక, ప్రాసములు విరామంబులుఁ • బరిఢవింప.

## స్వస్థానార్ధసమవివేకము.

ఆ. అక్షరములు సమము • లయ్యె స్వస్థానార్ధ, సమములందు నాల్గు • చరణములను
విషమపదము లొక్క • విధముగణంబులు, సమపదంబు లొక్క • సరిగణములు. 182

క. సగ మొక్కవిధంబునఁ జెలి, సగ మొక్క తెఱంగు గాఁగ • సమకూర్పఁ దగున్
జగతి నొకకా లొకకరణి, నొగి మూఁడుపదంబు లొక్క • యోజం దనరున్.

తే. సాధుకవికృతగ్రంథసం • జాత మెల్ల, వెదకి సకలోపజాతుల • విచ్చలవిడిఁ
గాళిదాసుఁడు రఘువంశ • కావ్యమునను, జెలఁగి రెండవసర్గలోఁ • జెప్పినాడు. 184

వ. అటు గాన స్వస్థానార్ధసమవృత్తంబులం దుపజాతి యనువృత్తము. 185

## ఉపజాతివృత్తము.

ఈపాటితోఁ బేసుల • నింద్రవజ్రం, బుపేంద్రవజ్రావ్యయ • మర్విసర్గం
దాపించినంతం గరు • ణాసముద్రా, జపిష్ఠలోలా యుపజాతి యయ్యెన్. 186

వ. ఇది పదునొకండవ త్రిష్టుప్ఛందంబునందలి యింద్రవజ్రాచ్ఛాయను బేసిపాదాలును నుపేంద్రవజ్రాఛాయను సరిపాదాలును నడుచును. [1]దీనిపేరె నిశి. 187

మఱియు, వ్యత్యస్తోపజాతి.

తలంబులై బేసి జ•తజ్జగంబుల్, చాలొప్పసర్లందత•జల్గగంబుల్
జలంబులోనిట్లు • సాగినంతన్, వాలారు వ్యత్యస్తము • వాసుదేవా! 188

వ. ఇది ఉపేంద్రవజ్రచ్ఛాయను బేసిపాదాలును, ఇంద్రవజ్రచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 189

సమోపజాతి.

తాపింఛనీలాంగుఁ బృ•దాకుతల్పున్, గోపాలబాలు న్రవి•కోటితేజున్
కృపాసముద్రు న్నుతి•యించెద న్స్మ,కృష్ణ్యపాధిఁ గాంక్షించి స•మోపజాతిన్.

వ. ఇంద్రవజ్రాఛాయను మొదలిరెండు పాదములను నుపేంద్రవజ్రాఛాయను గడమ రెండుపాదములను నడుచును. మఱియు, 191

వ్యత్యస్తసమోపజాతి.

తపంబుచేఁ గొల్తు వి•ధాతృతాతన్, గప్తాలికోదండవి•ఖండనాఖ్యున్
గోపీభుజంగున్ ధృత•గోత్రు సన్మో, క్షోపాయు వ్యత్యస్త స•మోపజాతిన్. 192

వ. ఇది యుపేంద్రవజ్రాచ్ఛాయను మొదలిరెండు పాదములును నింద్రవజ్రాచ్ఛాయను గడమ రెండుపాదాలును నడుచును. మఱియు, 193

వైపరీత్యోపజాతి.

తాజ ల్గగంబొంట జ•తజ్జగంబుల్, గజిక్కన మ్మూఁటను•గంతువేయున్
వ్రజాంగనావల్లభ•వైపరీత్యో,పజాతివృత్తంబు స•భం జెలంగున్. 194

వ. ఇది యింద్రవజ్రాఛాయను మొదలిచరణమున నుపేంద్రవజ్రాఛాయను గడమ మూఁడుచరణములును నడుచును. దీనిపేరె [2]క్ష్మాతాంగి యగు, మఱియు నీవృత్తముననే యింద్రవజ్రాచ్ఛాయను ఏదైన నొకచరణమును నుపేంద్రవజ్రాచ్ఛాయను ఏవైన మూఁడుచరణములును జెప్పినను తప్పులేదు. మఱియును, 195

ఉపచిత్ర.

భిదురంచిసపావలు • బేసులన్, గాదిలి భాభగ•గంబులు సర్లన్
గుదు శై రసికస్తుతి•గూడినన్, శ్రీదయితా యుప•చిత్ర చెలంగున్. 196

1 ఈవాక్యము పూ. ము. లలో లేదు.

2. వారాంగిని (పూ. ము.); వారాంగి యందు ఏచ్చును. (చూ. అ. 4. 207)

వ. ఇది త్రిష్టుప్ఛందమునందలి వృత్తచ్ఛాయను బేసిపాదములను దోదకవృత్తచ్ఛాయను సరిపాదములను నడుచును. మఱియు, 197

### నారీనుతము.

పేరంబు ల్వారోరి బేసి న్మతాగా, సారంబు సర్లన్ దత జల్లగంబుల్
ధీరోదాత్తుల్ సన్నుతింపన్ ధరిత్రిన్, నారీనుతం బయ్యె జనార్దనాఖ్యా. 198

వ. ఇది పదునొకొండవ త్రిష్టుప్ఛందస్సునందలి శాలినీవృత్తచ్ఛాయను బేసిపాదములను నింద్రవజ్రాచ్ఛాయను సరిపాదములును నడుచును. మఱియు, 199

### అజితప్రతాపము.

జలజాక్షు! బేసుల సజల్ ససలున్, బలుమఱున్ సరి నభజ్రలొందఁగా
జలజోద్భవాబ్జజవిశాలయతుల్, దళము లైన యజితప్రతాపమా. 200

వ. ఇది పండ్రెండవ జగతీచ్ఛందస్సునందలి ప్రమితాక్షరవృత్తచ్ఛాయను సరిపాదములను బ్రియంవదావృత్తచ్ఛాయను బేసిపాదములను నడుచును. మఱియు, 201

### రతిప్రియము.

బేసి న్మజ్జరగలు పేర్చి సర్ల జంబున్, భసజ్జగల్గదిసిన పాదబద్ధ మై
యాసామోద్భవచతురాస్యవిశ్రమఖ్యాతి సన్నుతింపఁదగు రతిప్రియం బనన్.

వ. ఇది పదుమూఁడవ అతిజగతీచ్ఛందస్సునందలి ప్రహర్షిణీవృత్తచ్ఛాయను బేసిపాదములను రుచిరవృత్తచ్ఛాయను సరిపాదములును నడుచును. 203

ఇది స్వస్థానార్ధ సమవృత్తలక్షణం బింక స్వస్థానవిషమవృత్తంబు లెట్టి వనిన:—

### స్వస్థానవిషమవృత్తవివేకము.

ఆ. చరణములను వర్ణసంఖ్యలు దప్పక, నాల్గుపాదములగణములు నాల్గు
విధము లై చెలంగువృత్తముల్ స్వస్థాన, విషమవృత్తసంఖ్య వెలయుచుండు. 204

### ధరణి.

రసపై సచతుష్కము రారసలున్, నాససల్ మాససల్ నాటిన న్మణితా
పసనగరసపరిపక్వయతు, లొప్పొరు న్వాలాయముగా ధరణుల్. 205

వ. ఇది జగతీచ్ఛందస్సునందలి తోటకవృత్తచ్ఛాయను మొదటిపాదమునను గడమ మూఁడుచరణములను గవికల్పితము లై నడుచును. మఱియు, 206

### వారాంగి.

తాజల్గయుగ్మంబు జతజ్జగంబుల్, తజాగగంబుల్ మభతల్లగంబుల్
రాజిల్లు నిభేంద్రవిరామయుక్తిన్, వాజిగ్రీవా వారివారాంగి దగున్. 207

వ. ఇది యింద్రవజ్రాచ్ఛాయను మొదటిచరణమునను నుపేంద్రవజ్రాచ్ఛాయను రెండవచరణమునను గీతాలంబనవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను వాతోర్మివృత్తచ్ఛాయను నాలవచరణమునను నడుమను. మఱియు, 208

## అంగజాస్త్రము.

రంగు భమస్గల్ ♦ గ్రాలు మసజ్గల్, పొంగై మన్యగ♦ము ల్రజగ్గ లో
ప్పంగా నార్త♦వగిరివ లైతే, నంగజాస్త్రవృత్త ♦ మందగించుఁన్. 209

వ. ఇది రుగ్మవతీఛాయను మొదలిచరణమునను శుద్ధవిరాటిచ్ఛాయను రెండవచరణమునను పణవచ్ఛాయను మూఁడవచరణమునను మయూరసారిచ్ఛాయను నాల్గవచరణమునను నడుచును. మఱియు, 210

## నదీప్రఘోషము.

పోలిమై శారరం♦బుల్ జతజ్రంబులున్
తలంచఁగా యాయముల్ ♦ దతజ్రుల్
విలాసాచలాష్టేభ♦విశ్రాంతితోడన్
దేలింప నొప్పారు న♦దీప్రఘోషముల్. 211

వ. స్రగ్విణీవృత్తచ్ఛాయను మొదలిచరణమునను వంశస్థచ్ఛాయను రెండవచరణమునను భుజంగప్రయాతవృత్తచ్ఛాయను మూఁడవచరణమునను ఇంద్రవంశచ్ఛాయను నాలవచరణమునను నడుచును. 212

ఇది స్వస్థానవిషమవృత్తవివేకం బింకఁ బరస్థానార్ధసమవృత్తవివేకం బెఱింగించెద:—

## పరస్థానార్ధసమవృత్తవివేకము.

క. మానుగ సమాంఘ్రి లోకగతిఁ, బూనిక విషమాంఘ్రి లోక్య♦పోలికలిపులై
హీనాధిక్యములు పర,స్థానార్ధసమంబులందు ♦ సమవిషమములన్. 213

## మనోహరవృత్తము.

పేరై నతజజ్వలు ♦ బేసియెడన్, సరులన్ సచతుష్క♦ము ♦ సాగిన గం
భీరేభపితామహ♦విక్రమముల్, పెరుగంగ మనోహర♦వృత్తము లౌ. 214

వ. ఇది కలితాంతవృత్తచ్ఛాయను బేసిచరణములును దోటకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 215

## కేతుమతి.

జతబేసుల న్స♦జనగముల్, భాతి సరిన్ భరే♦ఫనగగంబుల్
యతిశైలసంఖ్య ♦ నమరఁగా, నాతతకేతుమ♦త్యభిధ మొప్పున్. 216

వేగవతి.

సగణత్రయగల్పను భేసిన్, బాగుగ సర్లను భత్రిగగంబుల్
నగవిశ్రమ మందము నొందన్, వేగవతీసతవృత్తమునందున్. 217

వియోగినీ.

ససజల్ గము సాగ చేసులన్, బసస్రగ్లము భాసిలున్ సరిన్
రసశైలవిరామసంగతిన్, బొసఁగు న్వియోగిని భూరమాధిపా. 218

పరావతి.

ఓలి రజ్రజాంతగంబు లంచి చేసులం,దులన్ జరస్రగంబులుం [1]గు దుర్వరింపఁగా
గ్రాలుచు న్నిధానదిగ్విరామ మొప్పఁగా,నిలం బరావతీసువృత్తమింపుగాంచున్.

ధృతమధ్య.

బారిగ చేసుల భాభగగంబుల్, సరుల నజాయులు సాగఁగమే ల
య్యారి శిలోచ్చయ మా స్తివిరామో, [2]దారత నొప్పను దా ధృతమధ్యన్. 220

వ. ఇది దోదకవృత్తచ్ఛాయను చేసిచరణములును తోదకవృత్తచ్ఛాయను సరిచరణములును నడుచును. 221

ఇది పరస్థానార్ధసమవృత్తవివేకం బింకఁ బరస్థానవిషమవృత్తవివేకం బెఱింగించెద:—

పరస్థానవిషమవృత్తవివేకము.

క. దానవహార యొకచరణం, బైనను రెండడుగు లైన నక్షరగణసం
ధానములను బెఱతెఱ వగు, వీనికిఁ బేరు పరదేశవిషమము లయ్యెన్. 222

శరభక్రీడ.

ఘనాదిత్యశ్రాంతి న్యమనసర గ ల్సాఁడుకాళ్లన్
గనద్ధాతృశ్రాంతి న్మభసయజగద్వంద్వ మొందన్
దనర్పంగాఁ బౌరాణికకథలదాశార్హ వాక్ప్ర
వ్య నర్హాం బై చెన్నార పనిశరభక్రీడసంజ్ఞన్. [3] 223

వ. ఇది చంద్రశ్రీఛాయను బ్రథమచరణమునను విశాలచ్ఛాయను మూఁడుచరణములను నడుచును. 224

---

1 గుదిరింపఁగా (వ్రా. ము) ఛందోభంగము. 2 ఈచరణము రెండవచరణమువలెలేదు. అన్ని ప్రతులందును ఇది ఇట్లేఉన్నది. 3 ఇందు నాలుగు చరణములును చంద్రశ్రీఛాయనే ఉన్నవి. రెండవచరణము గనద్ధామశ్రాంతిన్మభనయజగద్వంద్వ మొందన్ (వ్రా. ము).

### శ్రీరమణము.

ఆది భసగ౹లవ్వాత్తిన నాప్పై, గాదిలి భాభగ౹గంబులు మూఁటన్
బాదుకొనం గవి౹పల్కినచో లక్ష్మీదయితా ధర ౹ శ్రీరమణం బౌ. 225

వ. ఇది రుక్మవతీచ్ఛాయను దొలిచరణమును దోదకచ్ఛాయను మూఁడుచరణములును నడుచును. 226

### రథగమనమనోహరము.

గ్రథితనయుగరల౹గంబులుం బొసఁగం, బ్రథమతృతీయచతుర్థ౹పాదములు వచింపన్
విధిదళయుతు లొంది౹వింతగా నజార్యల్, రథగమనమనోహా౹రం బగున్ ధరిత్రిన్.

ఇది పరస్థానవిషమవృత్తవివేకం బింక సర్వపరస్థానవిషమవృత్తవివేకం బెట్టి దనిన:—

### సర్వపరస్థానవిషమవృత్తవివేకము.

క. ఉర్విని నాలుగుపదములఁ, బర్వినగణములను వర్ణ౹పఙ్క్తిగణనయున్
సర్వము విపరీతం బగు, సర్వపరస్థానవిషమ౹సంజ్ఞలను వారి. 228

### వీణారచనము.

వారిఁ దయసాగ లమితత౹జ్నభగాలు, న్సారించి తజ న్భసలు భ౹నాజనగంబుల్
జేర న్మణిదిగ్దళశశి౹శేఖరవళి వీణారచన ధరఁ జెలఁగును ౹ నాదవివుతా. 229

### [1]ఉద్ధతము.

అనుపార సు౹ద్ధత మన్యో, న్మరి సజములున్ ౹ నసజ్గలున్
బాసభనజగలు ౹ పజ్సలున్, ధర షణ్మహీధ్రగజ ౹ ధాతృయతిన్. 230

### మధుర.

వెసమధురాఖ్యము ౹ విన్నజారగల్ నా
రసలగములు మీద ౹ రాగననమ్యయల్
నసజజజగ లొందన్ ౹ దంతిరత్నాజది[2]
క్ప్రిసరవిరమంబు జెంది౹రసందనరారజా! 231

వ. ఇది ప్రభాతచ్ఛాయను మొదటిచరణమునను అపరాజితచ్ఛాయను రెండవచరణమునను మాలినీచ్ఛాయను మూఁడవచరణమునను నడుచును. నాలవచరణముకవికల్పితము.

### మణిదీపిక.

గురుపితామహామఖ్యులఁ గినిసి ౹ ఘోరరణములోఁ
జెరలిచె నరుఁ డని పలుక రత్న౹దీపిక ల్దినరును న

1 ఉద్గతము (వ్రా. మా). 2 ఛందోభంగము-చివరగణము యగణమై యుండవలెను.

క్షరనభభ్నభస ల్నినాసజకారభసలు నభర్సనసనసలు
న్భరసజాగలు భూపతు ల్వినభానువిశ్రమయుక్తితోన్. 233

ఉ. ఈసమవృత్తరాజి నుదయించువిరామములు న్గణంబులు౦
బ్రాసము లెల్లఁ దప్పక నమర్చి వచించిన నైదులోవ లై
భాసిలు వృత్తపద్యము లపారము లై విషమాహ్వయంబు లై
వానికి నెక్కు శిష్టజనపాలన దుష్టనిశాటచాలవా. 234

ఇది పంచవిధవృత్తవివేకం బింక వైతాళీయజాతివృత్తంబు లెఱింగించెద:—

మ. ప్రకటింతు న్ధర దక్షిణాంతికయు నౌపచ్ఛాందసంబుం బ్రవ
ర్తక యాపాతలికాపరాంతికలు వైతాళీయము న్జారుహా
సిక ప్రాచ్యంబు నుదీచ్యవృత్తి యనఁగాఁ జెన్నారువృత్తంబు లిం
దుకులశ్రేష్ఠ యనేకము ల్గలుగు నందుం గొన్ని వాక్రుచ్చెదన్. 235

క. ఖ్యాతిగను రగడలందును, వైతాళీయాఖ్యవృత్తవారములందున్
బీతాంబరగురువునకు, న్రీతిగఁ గృతుల న్లఘువులు రెండేసి యగున్. 236

## దక్షిణాంతిక.

ఉరుసాజగ లుండు జేసులన్, సరులం దూకొను సభ్రవంబులున్
దొర లేడిటఁ దొమ్మిదింట రా, ధరలోఁ జెన్నగు దక్షిణాంతికల్. 237

## ఔపచ్ఛాందసము.

ఇమిడి సలము లేడు తొమ్మిదింటన్, సమకూఱు న్యతిషడ్గ రేఫయుంబుల్
సమత న్వసుల సహ రేఫయుంబుల్, క్షమలో నౌపచ్ఛాందసంబు మించున్. 238

## ప్రవర్తక (వర్తక).

స్థిర జేసి నుదీచ్యవృత్తియున్, బరఁగు న్సర్గను బ్రాచ్యవృత్తియున్
గిరిమణియతి కీలితంబుగన్, బరమఁ గొల్వఁ బ్రవర్తకాఖ్య మా. 239

## ఆపాతలిక.

లము లాఱు వలున్భగగంబుల్, లము లెనిమిదిటికడన్భగగంబుల్
క్షమ గిరినవ క్రాంతులుం దగున్, బ్రమథితమర యాపాతలికాఖ్యల్. 240

## పరాంతిక.

ఇలవర్తకవృత్తరీతితోఁ, దుల రైయె పాదచతుష్టయంబులన్
బలసినయది పద్మనాభ చెన్నలరుం గృతులఁ బరాంతికాఖ్యచే. 241

## వైతాలీయము.

ఋతులఘువులు ♦ రేఫవంబులుక, ధృతవసులఘువులు ♦ రేఫవంబులుక
జత సమకొన ♦ సారసాక్ష పా, లితశుక వైతా♦లీయవృత్తమా. 242

## చారుహాసిక.

[1]ప్రమదమునను ♦ వర్తకాఖ్యవృ, త్తముచందంబున ♦ ధాత్రి సత్కవుల్
సమకూర్చిన♦శార్ఙ్గకార్ముకా, సమత న్మిఱును ♦ జారుహాసికల్. 243

## ప్రాచ్యవృత్తి.

తొలి నేడిటఁ ♦ దొమ్మిదింట క్రాం, తులు పదునాలుగు♦దూఱు బేసులం
దులఁ బదాఱు♦తొంగలించు స్వర్లలలి న్మాధవ♦ప్రాచ్యవృత్తి యా. 244

## ఉదీచ్యవృత్తి.

తమ కిర వగు♦దక్షిణాంతికా,ఖ్యము తేజంబున ♦ నందగించు మే
లిమికృతులఁ గ♦డిందివేలుపా,తిమురు ధ్వాత్రి ను♦దీచ్యవృత్తికల్. 245

ఇది వైతాలీయజాతివృత్తవివేకం బింక మాలికావృత్తవివేకంబు లెఱింగించెద:—

## మాలికావృత్తవివేకము.

తే. మాలికావృత్తము లనంగ ♦ మఱియు నైదు
దనరు నిరువదియాఱు ఛం♦దముల మించి
యల లయగ్రాహి లయవిభా♦తి లయహారి
గదసమాఙత్రిభంగియు దండ♦కంబు లనఁగ. 246

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదియక్కరములపద♦మూలయంఘ్రులు నా
ల్గొప్పయతిప్రాసంబులు, గుప్ప లయగ్రాహి యనఁగఁ ♦ గొమ రొందు హరీ. 247

## లయగ్రాహి.

ఇం బడరఁగా భజస♦నంబులతుద న్భజస♦నంబులపదంపడి భ♦యంబులు లయగ్రా
హింబరఁగుప్రాసవిర♦మంబునలుమాఱుగుదు♦రంబటుక వీశులఁతి♦రంబుగ వచింపఁగా
నంబరముగా వలసి♦తొంబగలి దానవక♦దంబము సహాయముగఁ♦బంబి త్రిదశు ల్బ
ద్ధాంబునిధి ద్రచ్చి యమృ♦తంబు గొనఁజాలఁసమ♦యంబు దొరకించితి మ♦దంబున
ముకుందా. 248

క. ముప్పదితొమ్మిదిమాత్రల, ముప్పదినాల్గర్ణముపద♦ముతదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్ప లయవిభాతి యనఁగఁ ♦ గొమ రొందు హరీ. 249

---

1 ప్రథమ (పూ. ము.) ప్రాసభంగము.

### లయవిభాతి.

పెనిమిటులు భార్యలును•దనయులను గాంచిరఁటె•మనమలర దొడ్డతప•మునసలదశ
స్యందనుఁడు సతికోసలియుఁ•దనకడుపులోపల భు•వనము లఖిలంబు నిడు•కొనిన
కొడుకున్రా, మునననినసనద్వయము•వెనుకనసగంబులును•జొనిపియతులుండు నెడ•లన
లుమలు ప్రాసంబునిలిపి కవీశ్వరులు•మును లయవిభాతి నిటు•నినువినుతిసేయఁ దురు•
వనజదళనేత్రా. 250

క. ముప్పదితొమ్మిదిమాత్రలు, ముప్పదియేడర్ణముపద•ములదంఘ్రులు నా
ల్గొప్ప యతిప్రాసంబులు, గుప్పిన లయహారి యనఁగ • గొమరొందు హరీ. 251

### లయహారి.

నగణములుపదునొకడు•సగణమునుగురువునిడి•మిగులనలువుఅయతులు•దగులఁలయ
హారిన్, బెగడిశతధృతిపరిప•రిగతుల మెఱయిడినమ•రిగిర్ఘుపతనువుఁబొడివి•నిగిడి
చనియంతన్, నిగమములు గొనివెసను•జగముఁ అద్రువఁబఱచి రొము•డిగికడపలిజడధి
ము•నిగిననభియాలిన్, బెగడుచునొడిసికరచి•తెగఁగొనినతురగగళుఁ•డగుహరివనఁగ
సుకవు•లగణుతిచెలంగన్. 252

క. ఇది నేత్రాంబుధిలము ము,ప్పదినాలుగువర్ణములను • బాదం బగుఁ ద
త్పదచాతుర్థికములచే, నొదవుఁ ద్రిభంగి యనువృత్త • మర్వురలోనన్. 253

### త్రిభంగివృత్తము.

విసువక[1]సుకవులు•రసఁబ్రతిపదమున•హాసగగముఁడొకతీరై మతివేసైఆముఁడొక
తీరై, రసనగణములును•ససభసగములును•పొసఁగినషడ్యతిసంగి ప్రణతింగింజెల్లుఁద్రి
భంగిన్, మసలెడువ్రజమున•దుసికిలి మధురకుఁ•గసికిసమృద్ధశుభాంగిందగుభంగిం
జేరి త్రిభంగిన్, వెసమనిచిననవ•బిసరుహనయనయు•ని సభలవేడ్కగురింతుర్ విను
తింతుర్ నిచ్చలుఁగాంతుర్. 254

క. ఇదినియమము లేనిమహా, పథమునఁ గావలసినంత • వ్యాఖ్యాణింపన్
గొదలేక సమరు దండక, ముదధీంద్రశయాన తావ•కోత్తమసుతులన్. 255

### దండకము.

విద్వాంసు లెల్లన్ హకారంబె కాని నకారంబె కాని సకారంబె కాని పచిం
పం దగున్స్మందుగా నిందుఁ గాదేని యాదిం దకారంబు గల్పించి యామీఁది
వెల్లం దకారంబు లే మెందుగా నిచ్చకు న్వచ్చునందాఁక నిర్మించి గుర్వంతముం జేసిన
న్దండకం బంద్రుభక్తానుయాయీ భుజంగేంద్ర శాయీ పయస్తక్రదధ్యాదిక స్తేయి

1 సుపలురస (పూ. ము). ఛందోభంగము. 2 వఖ్యాణింపన్ (ప); వఖ్యాణింపన్ (ఓ).

నైర్మల్యతాపింఛగుచ్ఛచ్ఛవిస్వచ్ఛమాయూరపింఛావచూడాసదాపూతబృందాటవీ మధ్యరథ్యాసమారాధ్యతథ్యార్భకక్రీడహేమేక్షణా ఖర్వదోర్గర్వసంభూతస్వర్వోర్వరాభారనిర్వాహకార్థాంగితక్రోడ చండప్రభామండితానేకమార్తాండకోటిప్రతీకాశ నానావిధస్తోకలోకేశ వైకుంఠసంవేశ ఘోషాంగనాలోల కాదంబినీనీల గోపాలబాలా నమస్తే పునస్తే నమః. 256

క. దండిగ నేకపదంబున, నుండెడివిన్ నాల్గడుగుల నుండెడివిన్ వే
దండావన దండకముల, పిండువు దనరారుఁ జండవృష్ట్యాదికముల్. 257

దండకము. ధూర్తుల్ననకారంబులు న్రెంటిపై సప్తరేఫంబులుం గూర్చినం జండవృష్ట్యాఖ్య మయ్యె న్నకారంబులు న్రెంటిపై నష్టరేఫంబులుం గూర్ప నర్ణాఖ్య మయ్యె న్నకారంబులు న్రెంటిపై రత్నసంఖ్యాకరేఫంబులుం గూర్చిన [1]న్నర్ణవం బయ్యె నోలి న్నకారంబులు న్రెంటిమీఁదం దశఖ్యాతరేఫంబులుం జెప్పినన్ వ్యాళ మయ్యె న్నకారంబులు న్రెంటిపై రుద్రసంఖ్యాకరేఫంబులు న్నిల్ప జీమూత మయ్యె న్నకారంబులు న్రెంటిపై నొప్పఁ బండ్రెండురేఫంబులుం జెంది లీలాకరం బయ్యెఁ బేర్మి న్నకారంబులు న్రెంటిపై మించు పద్మూఁడురేఫంబులు న్నంత నుద్దామ మయ్యె న్నకారంబులు న్రెంటిపై రూఢిఁ బద్నాల్గురేఫంబుల న్శంఖమన్దండకం బయ్యె నీరీతితోడ న్నకారంబులు న్రెంటితర్వాత నేడాదిగాఁ గారకారంబు లొప్పారఁగా నంఘ్రి నొక్కొక్కటెక్కించి కావించినం జండవృష్ట్యాది నానాలసద్దండకంబు ల్ప్రసాధించుఁ గాకుండె నాల్గంఘ్రులుం జేయఁగా వచ్చు [2]నీరీతి నేకోనసాహస్రపర్యంతముం గూర్చి యిచ్ఛావిధిం జెప్పఁగావచ్చు గాంతంబుగా రాధికాజార శ్రీరుక్మిణీమానచోరా సుదంతాసునాథా కళిందాత్మజానాథవాఃకేళికాసక్త గోపీజనోత్సృష్టవస్త్రాపహారాశుకాస్యోక్తవాక్యామృతాంభోధిచంద్రోదయా సాంద్రదేవా నమస్తే పునస్తే నమః. 258

## జాత్యుపజాతినామములు.

క. జాతులు నుపజాతులు నన, భూతలమున రెండు భేదములు జాతులలో
జాతులు కందాదిక ముప, జాతులు గీతాదికములు సరసిజనయనా. 259

సీ. కందభేదము లాఱు గాక నుత్సాహంబు తరువోజ మధ్యాక్కరలు నైదు
దీపించుమంజరీద్విపదత్రిపదచతుష్పదపంచపాదిషట్పదవిధములు
తొమ్మిదివిధములతో నొప్పురగడలు కళికలు నుత్కళికలును గూడ
జాతులు నవవిధగీతంబులును సీసషట్కంబును నుపజాతు లయ్యె

---

1 న్నర్హ్వవం (పూ.ము.). 2 నీతీరు (ప).

తే. ననుచు నన్నయభట్టు భీ◆మనయుఁ బెద్ద
సచివుఁడును మూర్తి తాత[1]నా◆జ్జలు ననంత
మంత్రియునుఁ దిమ్మరాజు ని◆మ్మాడ్కిఁ జెప్పి
రందముగఁ దాము చేసిన◆ఛందములను. 260

## జాత్యుపజాతినిరూపణము.

క. గురులఘువులలో నెయ్యెది
మురసంహార ప్రథమపాద◆ముఖమున నిలిచెన్
ధర నుపజాతులు దక్కఁగఁ
బరఁగ నిలుచు నవియె నాల్గు◆పదములమొదలన్. 261

మ. ధరణిన్ జాతుల కాదివర్ణ మొకఁడే◆తప్పంగరా దెల్లెడన్
మరి తజ్జాతిగణంబులైన సరి యి◆ట్టట్లైనఁ గావచ్చు నుం
దరధారీ యుపజాతులం బ్రథమవ◆ర్ణంబు న్యథేచ్ఛంబుగా
సారదిం జెప్పఁగ వచ్చుఁ బ్రాసములు ని◆ల్చు న్వాళ్లకై యొక్కచోన్. 262

క. తెలియఁగ వినుమీ కామే, పలినామగ్రామధామ ◆ ప్రస్తుతపద్యం
బులు గీతకందసీసా, దులు విరతిగణనియమములతో ◆ వివరింతున్. 263

క. గురులఘువ్రల కేరిటియ, త్షరములు నష్టగణనామ◆కము లగులిపులున్
సురరిపుగర్వతమోభా, స్కర దీర్ఘము లైన రెండు◆గా నెన్నఁబడున్. 264

## కందషట్కాభిధానంబులు.

గీ. పరఁగఁ గందము పథ్యయు ◆ మరి విపులయుఁ
జపలయును ముఖచపలయు ◆ జఘనచపల
లనఁగ గందపద్యంబు లీ◆యాఱువిధము
లఖిలసుకవికృతులలోన ◆ నలరుచుండు. 265

సీ. నలగగభజసగ◆ణంబు లేసునె కాని కందంబునకు నొండు◆గణము సొరదు
[2]పీఁటిలోపల నొక◆మాఁటిచే వడి లేనిహీనపాదము మందుఁ ◆ గానఁబడును
దరువాత దీర్ఘపా◆దము పంచగణములఁ దగుదాని మూఁడవ◆తావునందు
నలజలు దక్కంగఁ◆గలయు వామీఁదనే యతి దాఁకునిజపదా◆ద్యక్షరంబు
తే. తుదినిగాసలు దక్కంగఁ ◆ గదియ దొకటి, కొంచెపడుగుల బేసుల ◆ గొప్పకాల
సరుల జగణంబు గూడదీ◆చరణయుగము, భువిని సగమయ్యె రెట్టింపఁ◆బూర్ణమయ్యె

1 నొజ్ఝ (ప). 2 వ్రాతప్రతులన్నిటిలో 'ఫీఁటి' అనియేయున్నది.

ఇది సమస్తప్రబంధములందుఁ జెప్పెడుసహజకందపద్యలక్షణము:—

పథ్య.

ధరలోఁ బథ్యాకందము, వారి యగు నాఱవయెడ నల • మాఁటిట్లై
విరతియుఁ గూడఁగ మూఁటను, నెరయుఁ జతుర్గణములు గమ • నిలిచినచోన్.

విపుల.

క్షమ జేవీశాలు సమపా, దములోఁ జొర శబ్ద మొకటి • తనరింపన్
సమధికపథ్యాకందము, గమనిక విపుల యన నలరు • కంద మగున్. 268

చపల.

[1]సమపదముల మొదలం జగ, ణముం గడమదుగునను ద్విగ•ణలఘువులై
[2]సమకోనువిరతియు పదిరేన్, లములే ముకుంద చప•లకు నమరున్. 269

ముఖచపల.

స్థిరఁ జపలాకందమువై, ఖరిన్ మొదలియడుగు చెప్పఁ•గఁ గవులు పె
ట్టిరి ముఖచపల యనెడుపే, రరిదిగ వైకుంఠ వరద • యఘుజైత్రా. 270

జఘనచపలాకందము.

క్షమఁ బథ్యరీతిఁ బూర్వా, ర్ధము చపలాకందముక్రియఁ • దగు నపరా
ర్ధము జఘనచపలకు మునం, ద్రమానసమరాళ•దాశార్హా. 271

క. గురువొకటి రెండులఘువులు, సరియైనకతమున వృత్త•చయములఁ దక్కన్
బెరజాత్యుపజాతులు వి,బ్బరముగ నెవ్వైన నిలుప•నచ్చున్ గృతులన్. 272

ఉత్సాహలక్షణము.

[3]ఈహ మీఱ సూర్యగణము•లేడు గాంత మైన ను
త్సాహవృత్త మనఁగఁ గృతులఁ • జాగుచుండు సత్కవి
వ్యూహసుతులు గాంచి కృష్ణుఁ • డోడిసి కాళ్లు పట్టి పెన్
ద్రోహి చావు మనుచు ఖరునిఁ • ద్రోచెఁ గాళ్లు మీఁదుగాన్. 273

తరువోజ.

శతమఖత్రితయంబు•జలజాప్తుఁడొకఁడు శతమఖత్రయిమీఁదఁ • జనువిశ్రమంబు
ప్రతిభ నీయడుగులో•ప్పఁగ రెండుగూర్పఁ బ్రతిమీఱనొక్కొక్క•పాదమైతనరఁ

---

1 సమపదముల మొదలం జగ,ణముగడపాదమునకు ద్విగ•ణలఘువులై (ప.ఓ.). ఇందు రెండవపాదమున మొదటిగణము జగణముకాదు. 2 సమకోనుయతియాఱవయది, లములాముకుంద చప•లకునమరున్ (పూ.ము). 3 ఈహ కారశక్ర (ప.ఓ.).

జతురంఘ్రి లీరీతి • జత కూర్చి సుకవి చతురవాచారూఢి • జలజాక్షుసుతులఁ
గృతులందుఁ దరువోజ • సరోజ నెసఁగఁ గృతకృత్యుఁ డై చెప్పు • క్షితి నెల్లసభల.

పంచవిధాక్కరంబు లెట్టివనిన:—

క. మధుదమన పురందరధా, మధిచంద్రగణాలిచే ను • మ మహామధ్యా
మధురాంతరాల్పపూర్వ, గ్రథితాక్కర లైదు దనరు • గ్రంథములందున్. 275

మహాక్కర.

సూరుఁ డొకఁడును మున్నుగాఁ దర్వాత • సుత్రాము లేవురు పిఱుఁద నొక్క
తారకేశుండుఁ జత యైన నిట్టిస • ప్తగణంబు లొక్కపాదంబునకుఁ
జేరు రెండవచోట నాలవచోటఁ • జిత్రభానుగణంబు గదియుచుండు
నోరసిలు నాలవగణంబుపై క్రాంతి • యుత్పలాంగ మహాక్కరంబునకు. 276

మధ్యాక్కర.

మనువుగాఁ బ్రాసంబు గూర్చి • మూఁటిపై విరమంబు నిల్పి
చన నింద్రయుగళంబుమీఁద • కలజాప్తు నొక్కనిఁ జేర్చి
యినుమడించిన నాలుగణము • లెనసిన నొక్కపాదంబు
దనర వక్కాణించినంతఁ • దగు నిట్లు మధ్యాక్కరంబు. 277

మధురాక్కర.

మురనిశాటేంద్రసంహార • మూఁటిపై విరతు లుంచి
తరణిశక్రత్రయంబు సు • ధామయూఖునితోఁ గూర్చి
వరుసలో నేనుగణముల • పాద మొక్కటి యొనర్చి
దొరలఁ జెప్పిన నొప్పుఁ గృ • తుల మధురాక్కరంబు. 278

* అంతరాక్కర.

[1]భానుఁ డిద్ద ఱాదిత్య • పతులు చంద్రుండు
పూని నాలుగుచరణ • ములఁ ద్రిగణాంత
మైనవర్ణంబు విరతి • నంతరాక్కరంబు
భానశీతాంశునేత్ర • పద్మాళత్ర. 279

1 భానుఁ డిద్ద రాదిత్య • పతులు తమిస్రాపతియు, జానుమీర నీనాలుగు • చరణములవు త్రిగణాంత, మైనవర్ణంబువిరతి • నంతరాక్కరంబు, భానుశీతాంశునేత్ర • పద్మాళత్ర (ప. ఓ.). *భానుఁ డిద్ద ఱాదిత్య • పతులు చంద్రుండు, పూని నాలుగు చరణ • ములఁ ద్రిగణాంత, మైనవర్ణంబువిరతి • నంతాక్కరంబు, భానుశీతాంశు నేత్ర • పద్మాళత్ర. ఛందోభంగములేకుండ నిట్లు సవరణ చేయవగునేమో ?

### అల్పాక్కర.

విరమంబు రెంటిపై • విస్తరిల్లి, సురపు లిద్దఱు నొక్క • సోముండు రా
జరణ మీమాఁటిచే • సాగి యొప్ప, హరిపపర్యంక య • ల్పాక్కరంబు. 280

### మఱియు, మంజరి.

తుద మొదళ్లను [1]నంటి • దూఁకు శబ్దంబు, వర్జించి యతి మాఱు • ప్రాసంబు లిడక
ప్రాసంబులేనిద్వి • పద యై చెలంగఁ, బ్రాసంబుతుదలందుఁ • బదిలంబు చేసి
[2](సాగింపఁగాఁ జాల • సత్కవీశ్వరులు, మోదంబు పెంపార • భూమిలోపలను
బద్మాక్షుఁ డెపుడు చే • పట్టు మంజరుల, చందాన నలరారు • జగతి మంజరులు.) 281

### ద్విపద.

సురపతిత్రితయంబు • సూర్యుఁ డొక్కండు
విరమంబు రెంటిపై • వెలయు నొక్కటికి
క్షితిఁ దగ నీరెంటి • చే నొప్పు ద్విపద
మితి లేక చెప్పిన • మే లండ్రు కవులు. 282

### త్రిపద.

తొలుతను నల్వు రిం • ద్రులు రెంట మూఁటను
బలభిద్ద్వయంబును రవియు • వళి లేక నలరారుఁ ద్రిపద. 283

### చతుష్పద.

జలజాసనవిశ్రమ • సంయుతమై, లలి షోడశమిత • లఘువులతోడఁ
గలసి చతుష్పద • గతులను ధరలోఁ, జెలు వగుఁ జౌపద • సేవకసులభా. 284

### వితాళచతుష్పద.

[3]భానుయుగము పై • పయి నవల నిం, పూన మణివిరతి • నొంది ధరలో
జా నలరుఁ జతు • ష్పదవితాళా, ఖ్యానమున వినా • యకతురంగా. 285

### కర్ణాటచతుష్పద.

మొగిఁ బంచలఘుగణం • బులు మూఁడు రవియుఁ
దగుతుదఁ బ్రాసంబు • దాఁక రెంటిపయి
నగువిశ్రమమ్ము క • ర్ణాటచౌపద యై
సగుఁ గృతుల సత్కవుల • సమ్మతముతోడ. 286

---

1 నంటితూఁకు (ప); నంటుతూఁకు (ఓ.). 2 ఈరెండుచరణములు వ్రాఁతపుస్తకములందు లేవు. పూ. ము. లలో 'బదిలంబుచేసి' తర్వాత కనఁబడుచున్నది. 3 ఈపాఠము పూ. ము. లోనిది (ప. ఓ.)లలో 'భానుగణయుగముపయినవలతిం' అనిఉన్నది. అర్థము విచార్యము.

